# అభినందన చంద్రిక



'సాహితీవల్లభ'

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి

63వ జన్మదినోత్సవ విశేష సంచిక




శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి,

తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.

# విషయసూచిక



తణుకులో వేంచేసియున్న
శ్రీ కే శ వ స్వా మి వా రు.

## శ్రీ మాడపాటి హనుమంతరావు

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభాపతి

ఆర్యా !

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారి 61వ జన్మదినోత్సవ ఆహ్వానము అందినది. వారి సేవానిరతి కొనియాడదగినది. తణుకులో వారికి సంబంధించిన సంస్థలు వారిఖ్యాతికి మిగుల తార్కాణములు. వారికి భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక ! వారికి నా శుభాకాంక్షలను అందజేతురుగాక !

## శ్రీ కల్లూరి చంద్రమౌళి

ఆంధ్ర - మాజీ - రెవిన్యూశాఖామంత్రులు

శ్రీ మాధవరామశర్మగారు 'ఔచిత్యవిచారచర్చ' అను తమ సద్గ్రంథమును శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు గారికి అంకితమొనర్చు సన్మానసభాశుభసమయమునకు నాలుగుమాటలు వ్రాసిపంపుడని నన్ను కోరిరి. అది నా కర్తవ్యముగ భావించి నా ఆశీస్సుల నందించుచున్నాను. వారిగ్రంథము నాకు లభింపమిచే అందలి విషయము లనుగూర్చి ముచ్చటింపబూనుట నాపనిగాదు.

శ్రీ మాధవరామశర్మగారితో నాకు సన్నిహిత సాంగత్యము గలదు. ఉభయులము ఆబాల్యమిత్రులము. అన్యోన్యానురాగబద్ధులము. వారు సదా నాశ్రేయము నాకాంక్షించు ఉత్తమచరితులు.

సంస్కృత ఆంధ్ర వాఙ్మయములను తఱచితఱచి ఉత్తమపాండిత్యమను నవనీతము నార్జించుకొన్న ప్రతిభా ప్రభావ శక్తిమంతులు. గీర్వాణభాషకు తనజీవితమును ముడుపుగట్టిన స్థిరదీక్షాదక్షులు. ఉన్నతాశయములను లక్షించి భిన్నపోకడల జిగిబిగుతలతో మధుర కవితారసము నందించుటలో దిట్ట. ధీరగాంభీర్యౌదార్యౌచిత్యము లను నిర్భయముగ వెలువరించు నిర్దుష్టభావపటుతాస్వభావులు. సాహిత్యవీథుల సునాయాసముగ విహరించు విహంగమము. సంస్కృతభాషలో నుపన్యసించు తరుణమున సభికుల నుఱ్ఱూతలూపించు శక్తియుతులు.

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు నాకు చిరపరిచితులు. నాశ్రేయము నభిలషించు సహృదయులు. లక్ష్మీప్రసన్నులు. సాహిత్యలోకమునకు చిరపరిచితులు. ఆసక్తితో ఉత్సాహముతో పండితులను, కవులను సన్మానించి ఆదరించు సహృదయులు. పాత్రమెరిగిన దాతలు. స్వార్జితధనమును సద్వినియోగమొనర్చు వివేక వంతులు, తెలుగుభాషలో ఉత్తమగ్రంథములను వెలికిదెచ్చు కృషికి చేయూతనిచ్చు ఉదారులు.

శ్రీ మాధవరామశర్మగారు కృతికర్తగ- శ్రీ తిమ్మరాజుగారు కృతిభర్తగ- ఆసీనులైయున్న ఈ శుభసమ యమున సద్భావముతో- నా ఈ శుభాక్షతలను ఉభయుల మస్తకములపై జల్లుచున్నాను.

భగవంతుడు వారి యోగక్షేమములను సదా సంరక్షించుచుండునుగాక !

ఆరోగ్యవంతులుగ, ఐశ్వర్యవంతులుగ దీర్ఘకాలము వర్ధిల్లుదురుగాక !

ఉత్తమాశయములకు నిలయులుగ-సత్సంప్రదాయముల నాచరించుచు తమజీవితమును నిర్వహింత్రుగాక !

## శ్రీ శివశంకరస్వామి

.... అలంకారశాస్త్రములో నిధి అయిన మాధవరామశర్మగారు ఔచిత్యవిచారచర్చ రచించి తిమ్మరాజు గారికి అంకితము చేయడము బహుభాషావేత్తలు, కవీశ్వరులు అయిన శ్రీమాన్ నారాయణాచార్యులుగారు అధ్యక్షులుగా ఉండడము ముదావహము.

శ్రీ తిమ్మరాజుగారికి శుభంభూయాత్.

ఇతిశివమ్.

## శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

ఇచట నేనున్న నీవాఁడనే యజస్ర
మీ వచటనున్న నావాఁడవే నిజముగ
కాయములకు దూరమ్ముఁ దగ్గఱయుఁగాని
మనసులకు నుండునే యొక్కమాటు గలియ ?

ఏ వాఁడు బ్రదుకఁ బెక్కురు జీవింతురో వాని నీడఁజేరి సుఖముగా
నా వాఁడె చిరము బ్రదుకంగావలె నను మునుల పలుకె కానుక యిత్తున్

శ్రీయుత ముళ్లపూడికులసింధుసుధాకర! తిమ్మరాజ! నీ
చేయు జగద్ధితార్థములె చేయు నినున్ భవదన్వయంబు దీ
ర్ఘాయు వనామయంబు సకలాభ్యుదయంబులు పొందునట్లు మే
మీయెడఁజేయు దీవనల యెల్లను వాని 'తథాస్తు' మాత్రముల్.

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి

'తిమ్మ' యన 'శాంత' మిది మేలి తెనుఁగుఁబల్కు
నిర్వికారతమై వెల్గు నీకు నిదియ
పేరుగానుంట నౌచితి మీఱిఁబోయె
తిమ్మరాజ! పుష్టకవిసుధీ సమాజ !

## సందేశములు

### శ్రీ విస్సా అప్పారావు

శ్రీ శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారు ఇట్లే చిరకాలము ప్రజాసేవ చేయుచు అనేకజన్మదినోత్సవములు మహావైభవముతో జరుపుకొందురుగాక !

జన్మదినోత్సవ సభాకార్యక్రమము విజయవంతముగ జరుగుగాక !

### శ్రీ జటావల్లభుల పురుషోత్తము

ఆర్య,

శ్రీ తిమ్మరాజు చౌదరిగారి 63వ జన్మదినోత్సవము, శ్రీ మాదవరామశర్మగారి కృతిసమర్పణోత్సవము, తత్సందర్భముగా జరుగు సారస్వతగోష్ఠి వీనియందు పాల్గొనవలయునన్న యుత్సాహము నాకెంతగానున్నను అనాడు కార్యాంతరాసక్తతచే నేను రాజాలకున్నాను. నా యభినందనములను తెలుపుచున్నాను. కార్యక్రమ మంతయు విజయోపేతముగా జరుగుగాక !

### శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

శ్రీయుతులు

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి కార్యనిర్వాహకులకు,

అర్యా,

తమరు దయతో పంపిన శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారి 63వ జన్మదినోత్సవ ఆహ్వానమందినది.

ఆహ్వానపత్రము చూచువరకును శ్రీ చౌదరిగారికి 63 ఏండ్లవయస్సని నాకు తెలియదు. సాహిత్య ప్రసక్తిలో పొంగిపోవు వారి యుత్సాహమును చరిత్రగవేషణములో పరుగులువారు వారి దీక్షాదక్షతలను వినూత్నగ్రంథప్రకటనములో ఉరకలువేయు వారి శ్రద్ధాసక్తులను చూచిన ఆయనకు షష్టిపూర్తియే కాలేదని పించును. ఆయన ఒక సారస్వత రసాయనపాయియైన యోగి. ఆయనకు వయస్సులేదు.

ఐనను— లౌకికముగ ఆయనకొక వయసువచ్చి జన్మదినోత్సవము చేయుచున్నారు కనుక దానిని పురస్కరించుకొని సాహిత్యబంధువులు శ్రీ చౌదరిగారికి నా హృదయపూర్వక శుభాభినందనములు.

శ్రీ నరేంద్రనాథుని పవిత్ర స్మృత్యంకమైన మీ సాహిత్యసంస్థ ఇతోధికమైన సత్కార్యముల నెన్నింటినైన సాధింపగలదని నా ఆశాస్యము.

ఈ ఉత్సవమునకు నా ప్రియమిత్రులలో ఒకరి ఆధ్యక్ష్యమును, ఒకరి కృతిప్రదానమును వెన్నెలకు తియ్యదనముగా పసిడికి పరిమళముగా భావింతును.

## శ్రీ గిడుగు వేంకటసీతాపతి

శ్రీ తిమ్మరాజుగారు తొమ్మిదేండ్ల బాలురా? నేను 11ఏళ్లు దాటిన బాలుడను. ఎట్లయినా రెండేళ్ల పైచిలుకు పెద్దవాడనే కనుక తిమ్మరాజుగారికి నా ఆశీస్సుల నందజేస్తున్నాను. వారిదివఱకే శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకులుగాను, విద్యాపోషకులుగాను, ప్రజాసేవాపరాయణులుగాను ఇంకా ఎన్నియో విధములుగాను ప్రఖ్యాతిపొందినవారు. ఇప్పుడు ఔచిత్యవిచారచర్చాకృతిభర్తలు కానున్నారా ? మంచిది, భగవంతుడు వీరికి ఆయురారోగ్యభాగ్యములనిచ్చి యశము చేకూర్చుగాక! ఇతోధికముగ!

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

ఆర్యా,

మ. రా. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారి 61వ జన్మదినమహోత్సవము తణుకుగ్రామమునందు వైభవోపేతముగ జరుపుచున్నారని విని చాల సంతసించితిని. శ్రీ తిమ్మరాజుగారు గుణత్రయోపేతులు— విద్య— వినయము— సంపద— వారియందు చక్కగా నెలకొని వారినొక యసాధారణ వ్యక్తిగ దిద్దినవి. వారి త్యాగనిరతియు విశేషముగవిన్నాము. అట్టి సజ్జనునియందు ప్రేమ గౌరవములను ప్రదర్శించుచున్న తామందరును అదృష్టవంతులు. దూరమునుండియే ఈ యుత్సవామోదమునందు నేనును పాల్గొనుచున్నాను. దర్శనాచార్య శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారును సరస్వతీపుత్ర శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు గారువంటి పెద్దలు ఈ యుత్సవము నలంకరించుట ఎంతయు శోభాహేతువుగ నుండగలదు.

శ్రీ తిమ్మరాజుగారు హైదరాబాదు వచ్చినప్పుడంతయు నాయందాదరముతో వచ్చి చూచిపోవుచుందురు. ఇది వారి సౌజన్యము.

భగవంతుడు శ్రీ తిమ్మరాజుచౌదరిగారికి సుదీర్ఘమైన ఆయువును, సుదృఢమైన ఆరోగ్యమును ప్రసాదించుగాక. లక్ష్మికి పూలసంకెళ్ళువైచి వీరియింటనే వసించునట్లు అనుగ్రహించుగాక.

## డా॥ పోణంగి శ్రీరామఅప్పారావు

శ్రీ తిమ్మరాజు చౌదరిగారికి పరమేశ్వరుడు సర్వసౌభాగ్యముల నొసంగుగాక. సభాకార్యక్రమం నిర్విఘ్నముగా శుభప్రదంగా జరుగునుగాక ! ...

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

....కృతిభర్తలు, విద్యాపోషకులు, సహృదయులు నగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారి 63వ జన్మదినోత్సవమును తాము జరుపుచున్నట్లు చూచి చాల సంతసించితిని.

శ్రీ ముళ్ళపూడివారి సౌజన్యమును, ఔదార్యము, బహుధా ప్రశంసనీయములు. వారి జన్మదినోత్సవము తెలుగునాడులోని ప్రతి పట్టణమునందును జరుగవలెనని నా ఆకాంక్ష.

అమూల్యములగు గ్రంథములు ప్రకటించి ఉత్తమ సారస్వత వ్యాపనమున వారు చేయుచున్న కృషి కొండాడదగినది, వారింకను ఎన్నో గ్రంథములు వెలుగులోనికి తీసికొనివత్తురనియు, కవిపండితులకు అండ దండగా నుందురనియు నా ప్రగాఢ ఆశయము.

వారికి పరమేశ్వరుడు అయురారోగ్యభాగ్యములు ప్రసాదించవలెనని నా ప్రార్థన.

## శ్రీ తూమాటి దోణప్ప

... శ్రీ తిమ్మరాజుగారు వదాన్యులు; కలాపోషక మూర్ధన్యులు. వారి పుట్టినరోజు పండుగను పురస్కరించుకొని మీ సాహిత్యమండలి చేసిన సన్నాహములు ఎంతో సంతోషమును కల్గించినవి. ప్రాచీనాంధ్ర సాహిత్యముపట్ల తత్ప్రచురణముపట్ల శ్రీ చౌదరిగారికి గల దీక్షాదక్షతలు ప్రశంసకు పాత్రము. వారి మనుగడ తెలుగువెలుగునకు ఏడుగడగా అంకితము.

వారికి ఇతోధికమైన ఆరోగ్యైశ్వర్యములును సుఖసంతోషములును అబ్బి వేయేండ్లువర్ధిల్ల ఆశంస! ఉత్సవములు జయప్రదము కావలెనని ఆకాంక్ష! .... సాహితీబంధువులకు నమస్కారములు.

## డా॥ నండూరి వేంకట రామకృష్ణమాచార్య

ప్రియమహోదయా!

.... సహస్రమాసజీవియై పూర్వపురుషాయుషమనుభవించి కృష్ణా గోదావరీ మధ్యదేశమును సాహిత్య సస్యశ్యామలముగకూడ ఒనరించి ధన్యజీవులు అగుదురుగాక అని ఆశీర్వదించుచున్నాను ....

## శ్రీ దిగుమర్తి వేంకటసీతారామస్వామి

శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారికి-

ఆర్యా,

.... మేను పులకించినది. నిజముగా నన్నయగారి పాదధూళికి నోచిన తణుకు తెలుగువారి యుత్తమ సాహిత్యక్షేత్రము. అట్టిదాని సర్వతోముఖాభివృద్ధికి నడుముగట్టిన మీ తండ్రికొడుకులు ధన్యతములు. భగవతి శ్రీదేవియేగాక వాగీశ్వరియు మిమ్మాశీర్వదించినది. నన్నయ్యగారి పేరును పెద్దసంస్థలకు- బాటలకు ఆక్రీడ నములకు (పార్కు) ఉంచి- మిక్కిలి ప్రచారమునకు తేగలసామర్థ్యము మీకున్నది. ఇట్లు చరిత్రయందు చెరుగని కీర్తితో మీరు ప్రకాశింపగలరు.

ఇంకొకమాట—

నెల్లూరువారు ప్రతిసంవత్సరమును తిక్కనపేరిట నొక మహాకవిని గౌరవించి నూటపదారులు ఇచ్చు చున్నారు. అట్లే ఇదివరకు మీయూర ఆ అచారములేనిచో శ్రీ నన్నయభట్టారకులపేర ప్రతికార్తికపూర్ణిమ యందును మీరును ఇట్టి యేర్పాటొకటి చేయుట- తణుకునకు మీకును గౌరవ ప్రతిపాదకము. మాబోటి అంధ్రసేవకులకు అనందప్రదము.

## శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారికి నమస్సులు.

సాహిత్యసమ్రాట్ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారిచే తెనిగింపబడిన 'ఔచిత్యవిచారచర్చ' అను గ్రంథమును తాము కృతినందుట యెంతయు నుచితముగానున్నది. అచార్యులవారి యధ్యక్షతయు సమంజసమే. తమ జన్మదినోత్సవములందు నిట్టికృతుల నందుకొని రచయితలనుదారముగా సన్మానింతురని యాశించు చున్నాను.

## శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

కార్యదర్శి, దక్షిణభారత హిందీప్రచారసభ - ఆంధ్ర.

ఆర్యా,

తమరు పంపిన శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారి 63వ జన్మదినోత్సవ ఆహ్వానమందినది. ధన్యవాదములు. శ్రీ తిమ్మరాజుగారి ప్రజాసేవ, విద్యాపోషకత్వము, అంధ్రదేశంలో ముఖ్యంగా పశ్చిమగోదావరి జిల్లాలో ప్రసిద్ధము. హిందీభాషఎడల, హిందీప్రచారముపట్ల వారికిగలప్రేమ అపారము. వారు మాసంస్థకు యావజ్జీవిత సభ్యులుకూడాను. అట్టివారి 63వ జన్మదినోత్సవము యీనెల 13వ తేదీన తణుకులో జరుగు చున్నందులకు చాల సంతోషము.

దయామయుడగు పరమేశ్వర కృపవలన శ్రీ రాజుగారు శతాయుష్మంతులై వారి ఆదరాభిమానములు అంధ్ర సాహితికి యితోధికముగా లభించుచుండగలవని ఆశించుచున్నాను.

## శ్రీ సూర్యదేవర సంజీవదేవ్

పూజ్యశ్రీ తిమ్మరాజుచౌదరిగారికి నమస్సులు.

.... మీజీవితంలో 62 శరదృతువులను దాటి 63లో ప్రవేశించారు. ఇంకా ఈవిధంగా ఎన్నో శరదృతువులు మీ జీవితంలో గడవాలని మా అందరి హార్దికాకాంక్ష.

జీవితంలో ప్రతి నూతనసంవత్సరం నూతనానుభవాలను తెస్తుంది; గడిచిన ప్రతి పురాతన సంవత్సరమూ పురాతనానుభవాలను స్థిరపరుస్తుంది.

మానవుడు కనీసం నూరేళ్ళకు పైన జీవించాలి. లేనిచో చేయాలసిన పనులు చాలా అసమాప్తంగానే మిగిలిపోతవి. అయితే నూరేళ్ళపయిన జీవిస్తేమాత్రం మిగిలిపోవా అంటే మిగిలిపోతవి. కాని అప్పటికి కొద్దిగామాత్రమే మిగిలిపోయి, ఎక్కువ పనులు సమాప్తమవుతవి.

అయితే అంత దీర్ఘజీవితంలో బాధలకూ దుఃఖాలకూ తావుండరాదు. ఆనందమయజీవితం కావాలి. నిత్యజీవితంలో ప్రత్యక్షమయే ప్రతి చిన్నకష్టానికి నష్టానికి వణకిపోతూంటే ఇంకా జీవికి ఆనందం ఎక్కడిదీ?

మానవుడు ఆనందసాధనను మరచిపోయి అనేక మనఃక్లేశాలకు లోనవుతున్నాడు. చుట్టూ బాధలూ, దుఃఖాలూ, ప్రియమైనవారి మరణాలూ, ఇవన్నీవున్నాకూడా మానవుడు వాటికి లోబడకుండా తన హృదయ మందిరములో ఆనందజ్వాలను వెలిగించగలడు.

మీ దీర్ఘజీవితం ఇటువంటి ఆనందమయజీవితం కావాలనే మా ఆకాంక్ష.

## శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీ నరేంద్రనాథసాహిత్యమండలి వ్యవస్థాపకులు, విద్యాపోషకులు, ప్రజాసేవాపరాయణులు, అత్యుదారులు నగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారికి 63వ జన్మదినోత్సవము జరుగుట అత్యంత ముదావహము. అది సాహిత్యచరిత్రవిమర్శకలోకమున కభ్యుదయసాధకము. అమూల్యమైన ఆంధ్రదేశచరిత్రకు సంబంధించిన గ్రంథములను వారినడుమ నిరంతర దీక్షతో వెలికిఁదెచ్చు యత్నము సేయుచున్నారు. ఆయత్నము సహస్రముఖమై వర్ధిల్లుటకై వారికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యభాగ్యముల ననుగ్రహించుగాక.

ఈ యభ్యుదయ సమయములో శ్రీ తిమ్మరాజుచౌదరిగారు 'దర్శనాచార్య, మహోపాధ్యాయ' ఇత్యాది బహుబిరుదభూషితులైన బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారిచే రచింపఁబడిన ఔచిత్యవిచార చర్చాకృతి స్వీకృతి విశేషాభినందనీయము. ఏతత్కృతి స్వీకృతివలన కృతిభర్తలకు కృతికర్తలకు శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలాచంద్రతారార్కముగ వెలయుఁగాతమని నాయాశంసనము.

ఈ మహోత్సవములు రెండును శుభోదర్కముగ వెలయుఁగాక యని నా యాకాంక్ష.

## NAVYA NATAKA SAMITI

HYDERABAD

( Formerly Dramatic Section, Navya Sahiti Samiti )

Hyderabad - 29,
10th October, 1963.

Dear Sir,

We note with much pleasure that the 63rd Birthday celebrations of the great patron of letters and culture, Sri Mullapudi Timma Raju garu, is being conducted in a fitting manner on the 13th October 1963.

We enclose the resolution passed by the Navya Nataka Samiti in this connection which we request you to kindly bring to the notice of the Committee on this occasion.

Thanking you,

Yours Sincerely,
V. Narasimha Rao,
General Secretary.

## RESOLUTION

"The Navya Nataka Samiti, Hyderabad, notes with great pleasure and satisfaction that the 63rd birthday of Sri Mullapudi Timmaraju garu is being celebrated in the befitting manner on the 13th October, 1963 at Tanuku. The patronage and philonthorpy of Sri Mullapudi Timmaraju garu to the arts, culture and education are too well known to be recounted. May God spare Sri Timmaraju garu many, many happy years to enable him to continue to noble work he has all along been doning."

V. Narasimha Rao,
General Secretary.

## శ్రీ బండారు తమ్మయ్య

మిత్రులు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారి 63వ జన్మదినోత్సవము పరమేశ్వరానుగ్రహమున వారి జన్మస్థానమగు తణుకు (తారకపురమున) ది. 13–10–93 తేదీని జరుగనుండుట చాల ముదావహము. భగవదనుగ్రహప్రసాదితమయిన యైశ్వర్యములను సత్కార్యాచరణమునకుఁ గవిపండిత సమాదరణమునకు, సారస్వతపోషణమునకు, ధర్మసంస్థానిర్మాణమునకు ఆంధ్రదేశమున వినియోగించు కతిపయధార్మికాగ్రణులలో శ్రీ తిమ్మరాజుగారొకరు. తణుకునందలి నరేంద్రనాథసాహిత్యమండలి, నన్నయభట్టారక నిలయము, శ్రీ వేంకటరాయ మెమోరియలు పోలిటెక్నికు కళాశాల మున్నగునవి వీరి ధార్మికత్వమున కాదర్శకములయి యజరామరచిహ్నములుగ వెలయగలవు. ఈ జన్మదినోత్సవ సందర్భమున నీవదాన్యులు పండితవర్య శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ విరచిత 'ఔచిత్యవిచారచర్చా'కృతిస్వీకరణ మొనర్చుట వీరి సత్కార్య పరాయణతకు మఱింత యౌచిత్యాపాదకము. శోభావహము కాఁగలదు. ధార్మికవరులు, మా యాంధ్ర సాహిత్యపరిషత్తు యావజ్జీవ సభ్యులలో నొకరు నయిన శ్రీ తిమ్మరాజుగారి త్రిషష్టి జన్మదినోత్సవము వైభవోపేతముగ, జయప్రదముగ నెఱవేఱుఁగాకయని భక్తజనావనతత్పరుండగు పరమేశ్వరుఁడు వీరికి శతాధి కాయురారోగ్య సౌభాగ్యములఁ బ్రసాదించుఁగావుత మనియు నభిలషించుచున్నాను.

## శ్రీ సి. వి. సుబ్బన్న

ఉ. మాధవరామశర్మ గుణమండనుఁ డాదికవీంద్రసాహితీ
మాధవమాకరందరసమంజులచిత్తుఁడు, సంప్రదాయ వి
ద్యాధనుఁ డాంధ్రసంస్కృత మహావన గంధగజేంద్రరూఢి పా
థోధరబాధవాగ్విభవధుర్యుఁడు ప్రస్తుతిపాత్రుఁ డెయ్యడన్.

శా. ఏవో నాలుగు ముక్కలన్ గఱచి తానే యెందు సర్వజ్ఞుఁడన్
భావమ్మున్ సభలందు మాటికి నుపన్యాసక్రియన్ జూపు దు
ర్దీ వైదగ్ధులు పోవుత్రోవఁ జన కెంతే సంప్రదాయైక వి
ద్యావైశద్యము జూపు మాధవయశోధాముప్ బ్రశంసించెదన్.

ఉ. స్తుత్యుఁడు ముళ్ళపూడికులసోముఁడు, మాధవరామశర్మయున్
స్తుత్యుఁడు; కీర్తిమంతులగుచున్ దగు నిర్వురి వియ్యమెంత యౌ
చిత్యము నిచ్చిపుచ్చుకొను చెయ్యుల దీప్తికిఁ దెచ్చె! నేఁటి యౌ
చిత్యవిచారచర్చ విలసిల్లెడు క్షేమ సమంచితమ్ముగన్.

ఆ. వె. ముళ్ళపూడివంశమూర్ధన్యుఁడగు తిమ్మ • రాజు తేజరిలుఁ జిరాయురాప్తి
సత్కవీంద్రలోకసత్కారశీలుఁడై • శశ్వదమృతనిభయశఃప్రశస్తి.

# సందేశములు

## శ్రీ కొత్త భావయ్యచౌదరి

పూజ్యులు, దేశసేవాపరతంత్రులు, సాహిత్యాభిమానులు, మీ సాహిత్యమండలి నిర్మాణదక్షులు, అనేక కవిపండిత సన్మానచతురులు, బహుకృతీశ్వరులు, తణుకునగరపలువిధాభివృద్ధికారకులు, పారిశ్రామికవేత్తలు, నానావిధదానధర్మపరతంత్రులు, యశోవంతులు నగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి 60వ జన్మదినోత్సవమును, ప్రసిద్ధపండితులగు మా శివరామశర్మగారిచే కృతిసమర్పణ మహోత్సవమును మీమండలి జరుపుచున్నందులకు మిక్కిలి యానందించుచున్నాను. ఈ యుత్సవ కార్యక్రమము జయప్రదముగా జరుగుగాక యని కోరుచున్నాను సర్వేశ్వరుడు శ్రీ తిమ్మరాజుగారికి తోధికాయురారోగ్యైశ్వర్యాదులనిచ్చి, యింకను బహువిధ దానధర్మముల గావించుచు యశోవంతులై విరాజిల్లునట్లు అనుగ్రహింప వేడుచున్నాను. వారొనర్చు సాహిత్యసేవాదులు శాశ్వతరూపములు దాల్చుగాక ! కవిపండిత పరిశోధక మహాశయులకు కొంగుబంగారమగునట్లు శ్రీవారు మండలి నుద్ధరింతురుగాక యని కోరెదను.

## ఉపదేశమాల

దేశకాలానుగుణ్యోపదేశమాల • దాతయౌ తిమ్మరాజచౌదరి వరేణ్యు
జన్మ వత్సరాంకితముగఁ జగతివెల్గు • నందు గావుత లోకహితార్థముగను.

కలవారిధనము అక్కర • గలనాటికి మరల జన్మగలిగినగానీ
నిలబడదు ధర్మమొక్కటె • నిలుచును వారికి యశంబు నిల్చును ధరపై.

చాలఁగనేర్చి శాస్త్రములఁ • జందురుఁ జేరఁగఁబోవనెంచి భూ -
గోళము చుట్టివచ్చెడి ని • గూఢ విమానపురాకెటుల్ తయా
రై లలితాభ్రవీథులను • నాపయనీరులు సంచరించినన్
వేలుగ సృష్టిచిత్ర విను • వీథులఁగాంచిన నేమిలాభ మా
పాలనలోన సజ్జనుల • పాలిటి స్వేచ్ఛ కలుంగకున్నచో.

ధర్మమార్గాన చరియించు కర్మపరుల • వ్యక్తిస్వేచ్ఛకు భంగము వరలకుండ
జాతికి సమిష్టికార్యముల్ సలుపుటొప్పు • భావిసంపద సౌఖ్యముల్ ప్రబలమొంద.

మానవుల స్వేచ్ఛ నరికట్ట బూనుకొన్న • యంత్రతుల్యులైపోయి నియంతభావ
దాస్యమునమ్రగ్గుచుందు రీ దారిమనకు • లాభమును క్షేమమును గోఱు రణములవలె. ౪

ప్రజల వ్యాపారసంపదల్ భంగమొంద • చీటికిని మాటి కధికార ధాటిజూపి
వాని హరియింప తుదకవి వశ్యమగును • లంచగొండి యుద్యోగుల కంచెలపయి. ౫

ప్రజలీకడగండ్లారసి • ఋజువర్తన గల్గువారి నేర్చి సభలలో
సుజనుల కీవలెపాలన • త్యజియించుచు స్వార్థపరుల ధర్మవిరతులన్. ౬

పదవులు సంపదలేరికి • చదువులు శాశ్వతముగావు సత్కర్మవినా
పదిలమగు శీలసంపద • ముదమారగ ధర్మచింత ముఖ్యంబెప్పుడున్. ౭

కాదని వ్యక్తిస్వతంత్రత • నేదేశమువాక్కు స్వేచ్ఛ నీకుండినచో
నాదర్శము లాశయములు • కాదనెడి నియంత్ర విధమె గనుటిది తప్పే. ౮

మతవిద్యా వాక్స్వాతం • త్రత లందున వ్యక్తిస్వేచ్ఛ ధర్మార్జనలో
హితమును సాయము నిచ్చుట • లతిముఖ్యం బేలునప్పు డార్యులు మెచ్చన్. ౯

వ్యాపార, కృషి, పరిశ్రమ • లేపారెడు నెచట జనుల కేర్పడు సుఖముల్
దాపునకు రావు కరవులు • నీపనులను బ్రోత్సహింప నెంతయు ఘనమౌ. ౧౦

దూరశ్రవణంబులచే • నేరని ధర్మముల నెఱిఁగి నృపు లెవరైనన్
మారణయంత్రవిసర్జన • చే రణముల నణఁగఁద్రొక్క చేటులుఁ దొలగున్. ౧౧

అణుబాంబులు, రాకెట్లున్ను • రణరంగమునందు వాడి రాక్షసులనగన్
గుణవంతులు పేరొందరు • జననాశమొనర్చువారి సాధనలేలా ? ౧౨

జననాయకులేదేశం • బునగాని నియంత్ర బుద్ధి బొందక సతమున్
జనులకు వైజ్ఞానికముగ • ఘనసౌఖ్యారోగ్యములను గావింపనగున్. ౧౩

పరిపాలనాధికారము • వరియించిరి ప్రజలొసంగ వారికి సుఖముల్
పరికించి వేయవలె నా • దరమున పాలనము, ద్రోహతను వీడి ఘనుల్. ౧౪

సహజీవన సిద్ధాంతము • మహిలో నేదేశమైన మన్నింపకలెన్
ఇహ సంపదలకు భంగము • నహి యని పేరందునట్లు నవ్యవిధులచే. ౧౫

ఇరుగుపొరుగు దేశంబుల • వరియించుచు స్నేహచింత వ్యాపారములన్
దఱుచుగ పరస్పరంబును • గరమును లాభముల బొందగావలె నెపుడున్. ౧౬

హిట్లరు, ముసోలినీ, పలు • పాట్లుబడి దురాక్రమణల పాలైన మహిన్
ఎట్లో జయించె ధర్మం • బిట్లే పరభూమినంద నెంచుట కీడౌ ౧౭

ఒకజాతిని పాలించఁగ • నొకజాతి బలాత్కరింప యుద్ధములగుఁగా
నొకజాతితోడ చెలిమిని • బ్రకటించిన నెన్నొమేళ్లు ప్రభవించుసుమా. ౧౮

హింసకు బ్రతిహింసయె యని • హింసింతురు మానవాళి యెచ్చోనైనన్
హింసద్యజించిన యోగ్యు లహింసను బాటించుచుందు రిదియెఱుగఁగనౌ, ౧౯

సంగీతము, నృత్యంబులు • సంగాతము మృదువచనము సాయపడు నిలన్
సంగరములైన వర్జిం • పంగా నిదిదెలిసి నడుపవలె సంఘములన్, ౨౦

దూరశ్రవణంబులచే • పారు విమానములవలన ప్రాపంచజనుల్
కోరిక నొకే కుటుంబము • వారుగనే సంచరింప వసతులు గల్గెన్. ౨౧

బ్రదికెడి నాల్గుదినంబులు • మదిలో దుర్మార్గచింత మానుట లెస్సా
వదలుచు పేరాసల నెపు • డదనున జింతించి దేవు నభ్యుదయముకై. ౨౨

వయసులోన దీరు వాంఛితార్థంబులు • కష్టపడి గడింపగలడు సుఖము
ముదిమిలోననేమి ముందువారలకేమి • దీపమున్న కాంతి జూపునట్లు. ౨౩

మితిలేని పదవికాంక్షయు • మితిమీరిన ద్రవ్యకాంక్ష మేలునకన్నన్
వెతలే గల్గించును సుమి • యతి సర్వత్రను త్యజింపనగునని వినమే, ౨౪

పుట్టినది గిట్టుకొఱకే • పెట్టినచో మఱపురాని పేరొందుటకే
కట్టడిపనులనుజేసిన • చిట్టచివర వానిఫలము జెందుటకొరకే. ౨౫

ఒకటిచెప్పి వేరె యొక్కటిసల్పెడి • వ్యక్తియైన దేశమైనగాని
గౌరవంబు జగతి గాంచరు నిత్యము • సుగతిలేదు నమ్మ జూడ రెవరు ౨౬

దేశకాల పాత్రంబుల తీరుతెలిఁగి • పెరుగుచున్నట్టి విజ్ఞానవీథులరసి
పౌండరీకాశ్వమేధాది పలుప పనులు • ప్రాతవౌ రోత సంస్కృతుల్ వదలివైచి
విశ్వకళ్యాణకృతుల గావించినట్టి • యార్యుల మహాశయమ్ముల నందుకొనుఁడు. ౨౭

ఇహపరంబుల చింత ప్రత్యహము నరుఁడు ♦ సమముగా సల్పి కార్యముల్ జరుపుటొప్పు
నుపనిషత్తులీరీతినే యుగ్గడించు ♦ యోగ్యత గృహస్థునకు కర్మయోగమగును

నదులుం బశుపక్ష్యాదులుఁ ♦ దరు గుల్మ లతాది వృద్ధిఁ దనరఁగజేయన్
జరగెడిని సృష్టికార్యం ♦ బెరిగియు నిదిచేయకుండ నెంచుట దప్పౌ. ౨౯

కష్టపడినగాని కావింపలే రెట్టి ♦ కార్యములను తెలివి గలుగదేని
రాళ్లు పిండిజేయ రత్నాలుదొరకునా ♦ కార్యదీక్ష నేర్పు గలుగవలయు. ౩౦

ఈ ప్రజాస్వామ్యదినముల నిద్ధకీర్తి ♦ త్యాగబుజవర్తనములచే నాచికొనుడు
స్వార్థమునువీడి నాయకుల్ సర్వజనుల ♦ సమముగాజూడ నేర్వంగ సౌఖ్యమబ్బు. ౩౧

కూడు, గుడ్డ, నివాసంబు గూర్పలేని ♦ దే ప్రభుత్వంబు మనగూడ దింత నిజము
దిని గుర్తించి పనిజేయు దేశమెదియు ♦ బ్రజకు మోదంబుగూర్చుచు వాసికెక్కు. ౩౨

ఇమ్ముగ నేపనిజేయ ఫ ♦ లమ్మును దాని కనుగుణ్య బ్రభవించునదా
రమ్మనవచ్చునె యితరము ♦ కుమ్మరియావమున మంటికుండలు దక్కన్. ౩౩

నేర్చుకొల దిగాక నిపుణత యబ్బునా ♦ నేర్వవలయు విద్య నియతితోడ
శిల్పి కఠినశిలలఁజెక్కి ంపఁడా ♦ వివిధరూపములను వృత్తియందు. ౩౪

సాహసించి చేయ సాధింపగలరెట్టి ♦ కార్యమైన దీక్ష గలిగెనేని
దేశరక్షణంబు దేశపాలనలైన ♦ మగతనమున కింపు తెగువతనము. ౩౫

పెద్దవారిజాడ ప్రియమున నడచిన ♦ గష్టకార్యమైన గాంచు జయము
సంఘశక్తిచేత సాధింప నగు నెల్ల ♦ మంచిపనులు చేయ నెంచుఁడయ్య. ౩౬

## శ్రీ శ్రీనివాస చక్రవర్తి

ఆర్యా !

నమస్కారములు. ఆహ్వానం అందినది. తొందరపనులవల్ల రాజాలనందున చింతిస్తున్నాను. క్షమించండి.

మీకు ఇతోధికంగా ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కలగాలని, విరివిగా అనేక గ్రంథములు వ్రాయించి కావ్యకన్యలను చేపట్టాలని ఆకాంక్షిస్తున్నాను.

## శ్రీ ఆవుల సాంబశివరావు

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలివారికి నమస్కారములు.

శ్రీ తిమ్మరాజుగారి జన్మదినోత్సవాహ్వానం అందినది. తిమ్మరాజుగారు రసపిపాసి. రసికవతంసుడు. వారి కళాప్రియత్వం సాహిత్యప్రపంచానికే పరిమితమైలేదు. కళాప్రపంచంలో ఆయన సర్వజ్ఞుడు. జరుపుతున్న యుత్సవంకూడా ఒక్క సాహిత్యవేత్తల అధ్వర్యంక్రిందనేకాక సర్వకళావేత్తల సన్నిధానంలో జరిగితే ఇంకా సముచితంగా నుండేదేమో!

అయినా తిమ్మరాజుగారి జన్మదినోత్సవాలు మనము ఇంకా చాలా జరుపుకోగలము. వాటిని కళోత్సవాలుగా, రసవాహినులుగా రూపొందించగలము. తిమ్మరాజుగారికి మీకు నా అభినందనలు.

## శ్రీ కొండవటి వేంకటకవి

పూజ్యశ్రీ సాహిత్యపోషకులకు నమస్సుమాంజలి.

ప్రభవ మొదలుకొని అక్షయ వఱకు అరువది సంవత్సరములు. ఇవి పూర్తియైన పిమ్మట ఒకటినుండి ప్రారంభింపవలెనుగదా! అట్లైన ఇది మూడవ సంవత్సరము. నవనవోన్మేషమైన మీ వయస్సుతోపాటు యశశ్చంద్రికలు వెల్లివిరియుగాత. చారిత్రక గ్రంథములేకాక పరశ్శతములుగా సాహిత్యగ్రంథములును మీ శీతల దయాదృష్టులవలన వెలుగులోనికి వచ్చుచుండుట ఆంధ్రభాషాయోషామతల్లికి శుభసమయము చేకూరినదని మాదృశుల సంతుష్టి. ఈ జన్మదినోత్సవ సందర్భమున "ఔచిత్యవిచారచర్చ"ను కృతిని స్వీకృతి నొనర్చుట ప్రత్యేక ముదావహము. అన్నివిషయముల "ఔచిత్యవిచారచర్చ" సేయదగినసమయముగదా!

వైదికమతానుయాయులు మానవుని ఆయుః ప్రమాణము 120 సంవత్సరములందురు. అట్లే మీకగుగాక!

## శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ

ఆర్యా,

మిత్రమహాశయులు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుచౌదరిగారి 61వ జన్మదినోత్సవ ఆహ్వానం అందుకొన్నానని మనవి. శ్రీ చౌదరిగారు నరేంద్రనాథసాహిత్యమండలిని స్థాపించి, తాలూకాబోర్డు అధ్యక్షులుగనుండి సారస్వత పోషణము, ప్రజాసేవ పెల్లుగచేసిన పుణ్యపురుషులు- ఆదికవి యజనమ్మొనర్చిన చోటును కేంద్రంగా సాహిత్య కార్యక్రమాలు సాగిస్తూన్న తమ్ము అభినందిస్తున్నాను. పరంపరాగతమైన ప్రశస్తి నిలబెడుతూన్న శ్రీ తిమ్మరాజుగారి జన్మదినోత్సవము విజయవంతమగుగాక!

## శ్రీ నాదెళ్ల మేథా దక్షిణామూర్తి

అయ్యా.

మీరంపిన జన్మదినోత్సవాహ్వానము నందుకొంటూ తత్సంబా కార్యక్రమమునందుఁ దొలుదొల్తఁగల పరిచయవాణి మా యుపనామముఁగలవారిదౌటలోనే కొంతయనుబంధము మదికిఁ దట్టినది.

ఆపైన నాధ్యక్షమన్ననో 'సరస్వతి'ని వైష్ణవిని జేయంజాలిన 'పుట్టపట్టి' యట్టి శ్రీమాన్ ఆచార్యుల వారిదై మరింత యాకర్షణము గొల్పినది.

ఇఁక సమర్పితమౌ కృతియా 'క్షేమేంద్ర కర్తృక'మై 'సాహిత్య'ప్రసాదకమైన గ్రంథములందగ్రగణ్యమైన 'ఔచిత్యవిచారచర్చ'

సంస్కృతభాషానభిజ్ఞుల కందలి విచారమెల్ల మదికెక్కఁదగ్గ వివరణము కావించినవారా 'దర్శనాచార్య, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, శాస్త్రవిశారద, సాహిత్యసామ్రాట్, లాక్షణిక శిరోమణి, విద్యాప్రవీ'ణాది బిరుదాభిరాములు మా జమ్ములమడక మాధవరామశర్మగారైరి. ఎవరుకోరిన బిరుదములెల్ల వారిచ్చువచ్చిన మైఁదగిలించుకొను నీ 'అడ్వర్టయిజమెంటు' యుగమందలి పద్ధతినిగాక యుదాహృతములైన బిరుదాదికముల కెల్ల సమర్థమైన పాండిత్యమును ప్రతిభయుంగలిగి లోకోపకారముల నెన్నెన్నొ విమర్శము లొనర్చుచు నుత్తమోత్తమ గ్రంథములు రచింపఁ బూనికఁ గలిగియున్న సాహిత్యాచార్యులైరి.

అట్టి ధీమణులవలన నిట్టి లోకోత్తర మహాకృతి నందుకొనుటలోని 'యౌచిత్యమా' విచారింపవలసినదే లేదు. మహావిమర్శగ్రంథమును లోకమున కందించు పూనిక వహించిన ముళ్ళపూడివారు దీన శాశ్వత యశస్సంపాదన మొనర్పఁజాలిరనుటలో నాశ్చర్యములేదు.

ఇంతటి యౌదార్యముతోడి వ్యవస్థాపకులు గల మీ సాహిత్యమండలికిఁగల 'నరేంద్రనాథ'త్వము నరేంద్రుడే లేకున్న యిక్కాలమున సార్థక్యము నందఁగలదని మీయుత్సవమునకు నా శుభాకాంక్షల నందించుచున్నాను.

## శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య

నమస్కారములు,

తమకు తమ 60వ జన్మదిన సందర్భమున పశ్చిమగోదావరి—కృష్ణామండల దివ్యజ్ఞానసమాజముయొక్క శుభాకాంక్షల నందించుచున్నాము.

## సందేశములు

### శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి కార్యదర్శులకు నమోవాకములు—

**అపూర్వమగు** తమ యాహ్వానమందినది.— "వృద్ధోపి తరుణాయతే" —ఔచిత్యయుతమైన కృతిసమర్పణోత్సవము సహృదయ హృదయోత్సవ జనకము. కృతిభర్తలకును, కృతికర్తలకును, అభినందనములు– శ్రీ నరేంద్రనాథసాహిత్యమండలి సంస్కృతాంధ్ర సాహితీవరివస్యా రహస్యజ్ఞులకు ప్రోత్సాహజనకమగుగాక. నన్నెరుగని శ్రీ సరస్వతీ పుత్రులకు సాదరాంజలి ప్రణామములు.

### శ్రీ ములగాల సేతుమాధవస్వామి

శ్లో. శ్రీశశ్రీమతి రాతనోతు విభవం తే విశ్వమోదాకరమ్ । శ్రీకంఠ శ్శివ మాత్మశక్తి విభవం విజ్ఞానవిశ్వాకరమ్
దీర్ఘాయుష్యశతం విరించి రభయం సాహిత్యశోభాకరమ్ । షష్ట్యబ్దత్ర్యధికప్రసాదజనక శ్రీ తిమ్మరాజాకరమ్.

శ్లో. ఇయంక్షేమంద్రేణ ప్రథితయశసా సారవచసా । కృతౌచిత్యే చర్చా పరిమలితసాహిత్యవిషయా
పదే వర్ణే వాక్యే రసభరిత బావాది విషయే । త్విదానీ మాంధ్రాఢ్యా తణుకుపుర సాహిత్యనిలయా.

శ్లో. పురుషోత్తమ బుద్ధిసారథే! । ఘన సాహిత్య నరేంద్రమండతే
జయ మాధవరామశర్మణా । జయ తిమ్మరాజ కృతీంద్రశర్మణా.

శ్లో. జన్మాఖ్యవిజ్ఞానసుసంభ్రమేఽ స్మిన్ । రాయః పితా తే విబుధస్వరూపః
దివ్యాశిషం బ్రహ్మముఖాద్దధానః । శ్రీ తిమ్మరాజ! త్వయి సాభిమానః

శ్లో. తిమ్మరాజకృత సాహితీకథా । కార్యరూప కరణై రలంకృతా
ఉత్తరోత్తరకలాతపస్వితా । చోత్తమా భవతు విజ్ఞసంపదా.

### శ్రీ సిహెచ్. సి. వి. రమణరావు

నమస్కారములు. ది. 13–10–63 మీ జన్మదినోత్సవ సందర్భములో మీ శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలివారి ఆహ్వానము అంది చాలా సంతోషించినాను. ఈమధ్య నాకు జ్వరముచే బాధపడుటచే రాలేకపోయినాను. శ్రీ పరమేశ్వరుడు మీకు యింకా చాలా జన్మదినోత్సవములు చేయుటకు దీర్ఘాయుష్మంతులై సాహిత్యమును ప్రోత్సహించుచుందురుగాక అని ప్రార్థించుచున్నాను.

వచ్చిన పండితులకు నమస్కారములు. శ్రీ ప్రసాద్‌గారికి నా శుభాశీస్సులు.

# శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ

ఆర్యా !

తాము శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారి 63వ జన్మదినోత్సవాహ్వానపత్రికను నాకు పంపినందు లకు మిక్కిలి కృతజ్ఞతను తెలియజేయుచున్నాను.

నరేంద్రనాథ సాహిత్యమండలి పోషకులు, వ్యవస్థాపకులు ప్రజాసేవాపరాయణులగు తిమ్మరాజుగారి 63 జన్మదినోత్సవము మిక్కిలి ప్రశంసాపాత్రముగ నాకర్షణీయముగ జనరంజకముగ మార్గదర్శకముగ జరుగుగాక! యని పరాత్పరుని ప్రార్థించుచున్నాను.

నాకు మిక్కిలి ఆప్తులు శ్రీ మాధవరామశర్మగారు. వారి పాండిత్యాదులు గ్రంథరచనా విధానాదులు అత్యన్త ప్రశంసాపాత్రము లనకతీరదు. నేడు అల్ప పాండిత్యాదులతో నల్లిబొల్లి కవనము లల్లుకొని రాణించ వలయుననుకొను కవిబ్రువులపాలిటి కఠోర కుఠారము శ్రీ శర్మగారు. వారి "ఔచిత్యవిచారచర్చా" కృతి సమర్పణ మహోత్సవము జరుగుట మిక్కిలి యోగ్యము. శ్రీ శర్మగారికి "అభినవక్షేమేంద్ర" యను బిరుదము మీరు సభాముఖమున తప్పక యివ్వదగుట యుక్తమని మీకు మనవిజేసికొందును.

శ్రీ మాధవరామశర్మగారు ఈరీతిని సంస్కృత సాహిత్యసారమును మథించి అపూర్వ గ్రంథరాజ ముల నాంధ్రములోని కనువాదముజేసి "మహామహోపాధ్యాయ" యను బిరుదమును నందుకొందురు గాక! యని శ్రీ శర్మగారికి నమస్కార పూర్వకముగ మనవిజేసికొందును.

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు నాకు బాల్య ప్రభృతి పరిచితులు. అపూర్వ ప్రతిభాచాతుర్య ముతో చరించు చతురుడు. సభాధ్యక్షత వహించి సభను జయప్రదముగ నొనర్చి రాయలసీమ, పూర్వాంధ్ర లకు సేతువుగా వ్యవహరించుగాక.

ఉపన్యాసకులలోని నాలుగవవారు ములగాల సేతుమాధవస్వామి నాకు ఆప్తమిత్రుడు. ఈనాటికి వీరు ఉపన్యాసకులుగానుండు పత్రికారాజమునుగాంచి మిక్కిలి సంతసించితిని.

ఇట్లు మహామేధావులు, పండిత ప్రకాండుల యుపన్యాసములతోను శ్రీ మాధవరామశర్మగారి కృతి సమర్పణా మహోత్సవముతోను, పుట్టపర్తిగారి అధ్యక్షతతోను శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి త్రిషష్టి జన్మ దినోత్సవము జయప్రదమగుగాక యని పరమేశ్వరుని మరొకమారు ప్రార్థించుచున్నాను. సభలో పాల్గొను టకు కారణాంతరములచే రాజాలమికి మన్నింప ప్రార్థన.

పరిచితులెల్లరికి నా హృదయపూర్వకమైన అభినందనము లందించుదురుగాక యని కోరెదను. మిత్రులు, అభిమానులు, ఆత్మీయులు, శ్రేయోభిలాషులు, పండితోత్తములగు శ్రీ మాధవరామశర్మగారికి నా హృదయపూర్వక నమస్కృతులు అందజేయ ప్రార్థన.

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారికి పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యాదు లొసంగి, ప్రజాసేవ, పండితపోషణము, సాహిత్యాభివృద్ధులు చేయులాగున ననుగ్రహించుగాక యని ప్రార్థన.

# సందేశములు

## శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారిని అయురారోగ్య భాగ్యయుక్తులుగా భగవదాశీస్సుల నభ్యర్థించి వ్రాయునది.

మా సహపాఠి శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి కృతిసమర్పణోత్సవముతోను, తదితర సహృదయ పండితుల ప్రవచనములతోను జరుపఁబడుచున్న తమ జన్మదినోత్సవమునకు కార్యాంతరములవలన రాజాలనయితినని విచారించుచున్నాను— ఈ మీ ౬౩వ జన్మదినోత్సవము విజయవంతమగుగాక ! శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకులగు తమకు జ్ఞానవిజ్ఞానసంపద సిద్ధించుఁగాక !

## శ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రి

తమకు పరమేశ్వరు డింకను మరియొక ౬౩వ జన్మదినోత్సవము చేసికొనుటకు పరిపూర్ణాయురారోగ్యముల నొసంగుగాత యని యీశ్వరుని వేడికొనుచుంటిని.

## SRI R. NARAYANA

Dear Sri Mullapudi Thimmaraju Chowdari garu,

I am extremely happy to learn that you are celebrating your 63rd birth day on 13th October under the presidentship of an eminent scholar like Sriman Puttaparthy Narayanacharyulu garu and I am thankful to you for having invited me to the Ceremony, but owing to other pre-occupations I could not avail of this golden opportunity of meeting you and the eminent scholars particularly on your memorable birth day. I am praying God to give you long and happy prosperous life. On this occassion, I am sending to you a recent publication brought out by this Department namely "Select Gold and Silver Coins in the Andhra Pradesh Government Museum" by Dr. M. Rama Rao.

I should also thank you for your proposal to Celebrate the birth day attended by famous and eminent literary persons as opposed to the Cultural entertainment in modern times on such occassions. By doing so, I feel that you have adopted the good tradition of Kakatiya Rulers in Celebration of their birth days. Kindly accept my birth day greetings and forgive me for my inability to be present on the occassion.

## SRI Y. VITTAL RAO

Dear Sirs,

I thank you very much for the invitation to attend the 63rd Birth Day celebrations of Sri Mullapudi Timmaraju garu. I could not attend for some reasons. Please accept my felicitations to the gentleman and very best wishes to god to shower his choicest blessings on the philanthropist to be of service and benefit to society by his benificence and munificence.

## SRI V. J. PATNAIK

I pray God that He may shower His choicest blessings on you and grant you long life, sound health and prosperity.

## SRI B. VENKATRAJU

Dear Sirs,

Thank you for your kind invitation for the 63rd Birth-day celebrations of Sri Mullapudi Thimmaraju choudary garu. His munificent donations to the various educational institutions in Andhra and his interest in Telugu literature are well known. I wish the function all success.

## శ్రీ మల్లెల శ్రీరామమూర్తి.

ఆర్యా,

తమ ఆహ్వానము అందినది. విద్యాపోషకులు, పూజనీయులు నగు మీ జనకులు శ్రీ తిమ్మరాజు చౌదరిగార్కి భగవంతుడు దీర్ఘాయురారోగ్య భాగ్యములిచ్చి రక్షించుచు ఇంకనూ దానధర్మములుచేసి, సాహిత్యమును పోషించునట్లు ఈశ్వరుడనుగ్రహించుగాక యని ప్రార్థించుచు నా శుభాకాంక్ష లందజేయు చున్నాను.

# సందేశములు

## శ్రీ శిరుగూరి హనుమంతరావు

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలివారు దయతో పంపిన శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారి 61వ జన్మదినోత్సవ ఆహ్వానము అంది మిక్కిలి సంతోషమయినది. దేహ అస్వస్థతవలన నేను స్వయముగా కృతజ్ఞతా నివేదనముచేసి, వారిని అభినందించుటకు వీలుకానందుకు చింతించుచున్నాను. ప్రొఫెసర్ హరూన్‌ఖాను షెర్వాని (Bar-at-law) **M. L. A.** వారి ద్వారా శ్రీ చౌదరిగారి పరిచయము నాకు లభించి 18 మాసములు అయినది. చరిత్రాంశములలోను, ఆంధ్రవాఙ్మయములోను వారికి అపారమగు ఉత్సాహమును, అపూర్వమైన విషయములను బహిరంగపరచి ప్రచురింపచేయుటయందు వారి ఆదరణ మును మిక్కిలి కొనియాడబడు విషయములని నాకు తోచినది. కుచేలుడు శ్రీకృష్ణమూర్తివారికి అతిభక్తితో వేపుడుబియ్యము పిడికెడు సమర్పించినటుల ఒకటి రెండు పుస్తకములు వారి ఉపయోగమునకు నేను సమ ర్పించుట నా భాగ్యమని తలచుచున్నాను. వారు దయతో పంపిన పుస్తకమును విమర్శించుటకూడా శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి, సాహిత్యమునకేగాక మానవయైక్యతకు శ్రీ పరమాత్మ తత్త్వజ్ఞానమునకు తోడ్పడునను ఆశతో పంపియుంటిని. ఆంధ్రసంస్కృతి, భారతీయ సంస్కృతివలె సర్వతోముఖమయినది. వైదిక, బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ, మహమ్మదీయ, క్రైస్తవ, పారసీక, హరిజన సంస్కృతుల మేళనము ఆంధ్ర దేశమందును, ముఖ్యపట్టణమగు హైదరాబాదు నందును, సంగమము అయినట్టు మరి యెక్కడను కాలేదు. వీరందరూ భగవత్సృష్టి వైచిత్ర్యమునకు చేరినవారె. ఈ **nuclear** యుగమందు ప్రపంచశాంతిని వృద్ధి పరచుటకు మనదేశమునందుండు సహనశక్తియే ఒక మార్గదర్శిగా యున్నది. శ్రీ పరమేశ్వరుడు శ్రీ తిమ్మ రాజు చౌదరీవారికి పూర్ణాయుర్దాయము ఇచ్చి, వారి పోషణవలన మానవశాంతికి కారణభూతములగు కార్య ములు జరిగించుగాక అని ప్రార్థించుచున్నాను. కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్ శతఙ్గః సమాః - నిష్కామ భగవత్ప్రీతి కలుగు కర్మలను చేయుచు నూరు సంవత్సరములు జీవించుమని ఈశావాస్య ఉపనిషత్ చెప్పు చున్నది. జీవేమశరదశ్శతం నందామ శరదశ్శతం మోదామ శరదశ్శతం అని బ్రహ్మజ్ఞానులు ప్రతిదినమూ బ్రహ్మని ప్రార్థించెదరు. ఈ ప్రార్థనలు శ్రీ చౌదరీవారి ఆయురారోగ్యములు కొరకు అన్వయించుగాక.

రత్నములు, హోమములు ననురాగలీల, నలరు నమ్మిక నీవలనావలనగు భంగి నరులందు జీవుండు ప్రాపుడగుచు, నెలమి దిరుగుచునుండు దానెందు జడడు! ఒక్కరై నిత్యులై యెక్కడగడతేక సారిది జన్మా దుల శూన్యుడగుచు సర్వంబు నందుండి సర్వంబు దనయందు నుండంగ సర్వాశ్రయుండనంగ! సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమున వెలిగి యఖిలంబు జూచుచు నఖిల ప్రభావుడై యఖి లంబు దనయందు నడచికొనుచు॥ నాత్మ మాయాగుణంబుల నాత్మమయముగాగ విశ్వంబు దనసృష్టి ఘనత జెందc జేయుచుండును సర్వ సంజీవనుండు రమణ విశ్వాత్ముడయిన నారాయణుండు॥ సతులెవ్వరు సుతు లెవ్వరు, పతులెవ్వరు మిత్రశత్రు బంధుప్రియసంగతులెవ్వరు సర్వాత్మకగతుడై గుణసాక్షియైన ఘనుండొక్క నికిన్॥ భా॥ షష్ఠ॥ 463 to 435 తొండమాన్ మహారాజును శ్రీ వెంకటాచలపతి అనుగ్రహించినట్లు శ్రీ ఆంధ్రదేశాధిపతియగు వెంకటేశ్వరుడు శ్రీ శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారిని ఆశీర్వదించి పూర్ణాయు ర్దాయము నిచ్చుగాక !

## శ్రీ యార్లగడ్డ రంగనాయకులుచౌదరి

ఔచిత్యవిచారచర్చగైకొని నీ
యౌచిత్య ప్రదర్శన చేసితహో
రుచియెరిగిన ప్రథిత సాహిత్య
రుచిరాస్వాది విజయమునీకు తిమ్మరాజ.

## శ్రీ బి. యస్. యల్. హనుమంతరావు

సహృదయులు, సాహిత్యాభిమానులు, సత్కవి పండిత పోషకులునైన మిమ్ములను, తమ "ఔచిత్య విచారచర్చా" కృతిపతిగా, సముచిత నిర్ణయమొనర్చిన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు అభినందనీయులు.

ఇదేవిధముగ పెక్కు జన్మదినోత్సవములను జరుపుకొనుచూ, పెక్కుకృతులను స్వీకరించి సారస్వత సేవ చేయగలరని మా అందరి ఆశయము,

## శ్రీ కె. పట్టాభిరామయ్య

మీరు యింకా చాల సంవత్సరములు జీవించి సాహిత్యాభివృద్ధిని, ప్రజాసేవను చేయుదురని కోరుచున్నాను,

## శ్రీ కొ. ఉమావరమూర్తి

మీకు భగవంతుడు ఇంకా చాలసంవత్సరాలు, ఆయురారోగ్యము ఇవ్వవలయునని ప్రార్థించుచున్నాము.

## శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకులు, ఆంధ్ర గీర్వాణభాషాపోషకులు, ప్రముఖ ప్రజాసేవా దురంధరులు, బహుగ్రంథకృతిభర్తలు, పేదలపాలిట కల్పతరువులు, 'అపరాంధ్రభోజుడు నాబరగి' ఆంధ్ర సారస్వత నందనోద్యానమును పైడిసస్యములతోను సంపన్న మొనర్చుటకు అవిరళంగా కృషి సల్పుతూవున్న పరమపూజ్యులు, కమ్మకులాలంకార శేఖరులు అయిన శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారి జన్మదినోత్సవము, నరేంద్రనాథసాహిత్యమండలిపక్షమున జరుపుట మిక్కిలి ఆనందదాయకమైన విషయము. శ్రీవారికి పరమేశ్వరుడు సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుగాకయని ప్రార్థించుచు వారి 61వ జన్మదినోత్సవ శుభసమయమున పాల్గొనజాలనందుకు మిక్కిలి చింతించుచున్నాను. వారికి నాపక్షాన శుభాకాంక్షలు అందజేయ ప్రార్థించుచున్నాను.

## సందేశములు

### శ్రీ ధనకుధరం వరదాచార్యులు

ప్రియ మహోదయా!

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకులు, విద్యాపోషకులు, ప్రజాసేవాపరాయణులు, మాన్య వదాన్యులు నగు మీ 63-వ జన్మదినోత్సవ సందర్భమున "దర్శనాచార్య - మహోపాధ్యాయ - సాహిత్యాచార్య - శాస్త్రవిశారద - సాహిత్యసామ్రాట్ - లాక్షణిక శిరోమణి - విద్యాప్రవీణ" శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి "ఔచిత్య విచారచర్చ" అను మహాగ్రంథమును మీరు కృతిస్వీకారము చేయుట మీ ఔచిత్యమునకు ఒక నిదర్శనము. ఈ కృతిస్వీకారము మీ కీర్తిపతాకకు వన్నె చేకూర్చినది.

బహుభాషావేత్తలు - మహాకవి, సరస్వతీపుత్ర బిరుదాంచితులు నగు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారి అధ్యక్షతన ఈ కృతిస్వీకారము జరుగుట మీ సుకృతవిశేషము.

ప్రభువులు - సారస్వత పోషకులు అయిన మీ జన్మదినోత్సవ సందర్భమున ఇట్లే ప్రతిసంవత్సరము కృతిస్వీకారము జరుగవలెనని మా కోరిక.

రాజరాజనరేంద్రుడు మొదలు నేటివఱకును మీవంటి సుకృతులు కృతులందుకొని, ఆంధ్రభాషాపోషకు చక్కని ఆకృతి కల్గించుచునే ఉన్నారు.

శ్రీ మాధవరామశర్మగారి బహుముఖప్రజ్ఞావిశేషములను గుర్తించి, వారి కృతిని మీరు నేడు స్వీకరించుట దేశమునకు ఆదర్శప్రాయమై, కవి - పండితలోకమునకు తుష్టిని, పుష్టిని చేకూర్చుచున్నది.

శ్రీ మాధవరామశర్మగారు ఇట్టి మహాగ్రంథములను ఇంకను అనేకముగా రచింపవలెననియు, ఆ మహా గ్రంథములను మీరు, మీబంధువులు అందఱు కృతిస్వీకారముచేసి, సాహిత్య సమారాధకులు కావలెననియు మా ఆకాంక్ష.

శ్రీ శర్మగారు, సహజముగా అద్వైతులు. నేను విశిష్టాద్వైతిని. అయినను, వారు దర్శనాచార్యులగుటచే, నేను వెలువరించు విశిష్టాద్వైత గ్రంథములకు చక్కని రూపురేఖలుదిద్ది, వారి సహృదయమును వ్యక్తీకరించినారు, కనుక, శ్రీ శర్మగారియందు నాకుగల భక్తిభావమును పురస్కరించుకొని, వారు మహా గ్రంథము లనేకముగా రచింపవలెనన్న కాంక్షతో ఇప్పు డీ శుభసమయమున రు 25/- లు ఖరీదుగల "ఫౌంటన్‌పెన్" వారికి సమర్పింపదలచితిని. మీ సన్మానము నందుకొని, వారిచ్చటకు విచ్చేసిన పిమ్మట శ్రీ శర్మగారికి దానిని నేను స్వయముగా సమర్పింపగలను. ఇదియే ఈ సందర్భమున వారికి నా భక్తికానుక.

ఈ విషయమును మీరు సభాముఖమున ప్రకటింపగోరెదను.

సర్వాంతర్యామియైన పరమాత్మ మీకు సర్వదా సర్వశుభములను సమకూర్చుగాక!

ఇదియే మీ యీ జన్మదినోత్సవ సందర్భములో మా శుభాకాంక్ష.

## శ్రీ జి. విద్యాసాగర్

మీ ८३వ జన్మదినోత్సవ ఆహ్వానం ఈరోజే నేను హృదయపూర్వకంగా అందుకొన్నాను. ప్రజాసేవ యందు నిమగ్నులైన మీవంటి మహోదయుల జన్మదినోత్సవం వైభవంగా జరుగుగావుత మని నా శుభాకాంక్ష. ఇట్టి జన్మదినోత్సవాలు శతాధికంగా మీకు జరుగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక !

అస్మద్గురుతుల్యులు, మహోపాధ్యాయులైన శ్రీ మాధవరామశర్మగారి 'ఔచిత్య విచారచర్చా' కృతి సమర్పణ మీ జన్మదినోత్సవానికి సముచితాలంకరణ నుపచరించింది. దర్శనాచార్యులవారి కృతికన్య మా యింటి ఆడబడుచు, ముగ్ధమోహిని ఎలా పాలించుకొంటారో? మీచేతుల్లో పెడుతున్నాం- దర్శనాచార్యుల వారికి నా నమస్కృతు లందించండి.

## శ్రీ జాస్తి వేంకటనరసయ్య

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారి ८३వ జన్మదినోత్సవ మహాసభ జయప్రదముగా జరుగుగాత ! సుప్రసిద్ధ పండితులైన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు తాము రచించిన "ఔచిత్యవిచారచర్చ" అను తమ రచనను ఈ సందర్భములో శ్రీ చౌదరిగారికి సమర్పించుట బంగారమునకు తావి యబ్బినట్లున్నది.

సభాధ్యక్షులుగా శ్రీ పుట్టపర్తివారును, వక్తలుగా మహాపండితకవులును లభించుట, తావిగల బంగారుకు మంచి దాతయు, సజ్జన యాచకులును లభించినట్లున్నవి. శ్రీ తిమ్మరాజుగారు తమ దాతృత్వముచే మిక్కిలి ప్రసిద్ధిని పొందిరి. శ్రీ శర్మగారు భారతదేశమునగల పండితోత్తములలో నగ్రగణ్యులు. వక్తలకు సభ్యులకు నా వందనములు. మహాసభలు జయప్రదముగా జరిగి సాహితీ చైతన్యమును దేశమందు కలిగించుగాత !

## టెలిగ్రాములు

శ్రీ కె. ఈశ్వరదత్తు, శ్రీ వేమరాజు నరసింహారావు, శ్రీ పి. అచ్చయ్యచౌదరి, శ్రీ సురేంద్ర, శ్రీ ఆడుసుమిల్లి శ్రీనివాసరావు. శ్రీ భీమసేనరావు, శ్రీ కె. వి. భూపాలరావు ప్రభృతులు టెలిగ్రాముల ద్వారా తమ అభినందనము తెలిపిరి.

# వక్తవ్యము

ఈ 'అభినందనచంద్రిక' శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు సాహితీవల్లభులయిన వారి 63వ జన్మదినోత్సవ-ఔచిత్య విచారచర్చాకృతి సమర్పణోత్సవ విశేషములను తెలుపు విశేష సంచిక.

ఇందులో ఆ ఉత్సవ సమయానకు స్వయముగా విచ్చేయలేని పెద్దలు నిండుమనస్సుతో పంపిన సందేశాలను, నాడు జరిగిన విశేషముల వర్ణనమును, ఉపన్యాసములను, పద్యోపహారములను, కొన్ని దృశ్యములను ప్రకటించినాము.

ఇందు ప్రకటించినవి కాక మఱికొంద రర్పించిన పద్యోపహారము లున్నవి, అవి ప్రస్తుతము అనుపలభ్యము లగుటచే ప్రచురింపలేదు.

నాడు శ్రీ తిమ్మరాజుగారికి తణుకు పట్టణ యువజన కాంగ్రెసు సంఘము, ది ఆంధ్రాషుగర్సు రిజర్వ్ ఏరియా చెఱకు సప్లయిదార్ల సంఘము, తణుకు పరిషత్ బహుళార్థసాధక పాఠశాల ఉపాధ్యాయ బృందము, తణుకు సినీప్రేక్షక సంఘము, శ్రీ కోట నారాయణమూర్తి, శ్రీ గొర్తి సత్యనారాయణమూర్తి, వేల్పూరు శారదా గ్రంథాలయము, తణుకు శ్రీ ముళ్ళపూడి వెంకటరాయ మెమోరియల్ పోలీటెక్నిక్ కళాశాల అధ్యాపకవర్గము— మొదలగువారు సన్మానపత్రములు బహూకరించిరి.

ఇది ఏనాడో వెలువడవలసినది. అన్ని సౌకర్యములు ఉన్నను అలస్యము కాక తప్పినదికాదు.

ఇందు సహకరించినవారి కెల్లరకు మా కృతజ్ఞతలు,

శ్రీరామనవమి,
10—4—1965.

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి,
తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.



కీ. శే. శ్రీ ముళ్లపూడి వేంకటరాయుడుగారు.

(1864 — 18–2–1943)



శ్రీ తిమ్మరాజుగారి మాతృదేవి

కీ. శే. శ్రీ ముళ్లపూడి అక్కమాంబగారు

1874 — 1952.



శ్రీమతి ముళ్లపూడి వెంకటరమణమ్మ.

జననము : 1902.　　మరణము : 1923.



శ్రీమతి మఱ్ఱిపూడి కమలాదేవి.

జననము : 19—5—1903.



ఉదయం శ్రీ తిమ్మరాజుగారింట జరిగిన కవితాగోష్ఠిలో పాల్గొనినవారు.

ఎడమనుంచి కుడికి :

శ్రీయుతులు కొత్త సత్యనారాయణచౌదరి, కాంద్రేగుల రామచంద్రరావు, కంభంపాటి రామ గోపాలకృష్ణమూర్తి, బూదునపల్లి సత్యనారాయణ, ముక్తేవి లక్ష్మణదాసు, మేడూరి వెంకటసోమేశ్వర కృష్ణమూర్తి, జమ్ములమడక మాధవరామశర్మ, అమ్మిసెట్టి లక్ష్మయ్య, గుత్తికొన సూర్యనారాయణ, పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి, ముళ్ళపూడి తిమ్మరాజు, నాదెళ్ళ కృష్ణమూర్తి, పుట్టపర్తి నారాయణాచార్యులు, యలమర్తి నారాయణరావు, పెన్మెత్స సత్యనారాయణరాజు, చిట్టూరి భువనైకరావు, యేలూరిపాటి అనంతరామయ్య, ఆచార్య గారలు.

# శ్రీ ముళ్లపూడి తిమ్మరాజ చౌదరి
## 63వ జన్మదినోత్సవ విశేషములు

### కవితాగోష్ఠి

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి జన్మదినోత్సవసభ అసాధారణమైన శోభతో జరిగింది. చాలామంది సంపన్నులు జన్మదినోత్సవసభల వైభవమును అనుభవించుతూనేవుంటారు. తిమ్మరాజుగారి జన్మదినోత్సవసభలో ఉత్సవవైభవమును తిమ్మరాజుగారనుభవించడమన్నది అంత ముఖ్యంగా కన్పడలేదు. ఈ జన్మదినోత్సవ వైభవమును చూడడానికై వచ్చిన ప్రేక్షకులు శ్రోతలై వైభవమును అనుభవించారు. "నాకు మొదట్నుంచీ ఉపాధ్యాయులతో పరిచయం, కవులను దర్శించాలని నాకు అభిలాష, కవులు పండితులు చాలామంది దయచేయడం నా పూర్వసుకృతం" అని తిమ్మరాజుగారంటూ వారి యింటిలో ఉదయంపూట కవులను, పండితులను, సహృదయులను సాదరంగా ఆహ్వానించారు. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ పిల్లలమజ్జి మార్కండేయశాస్త్రి, శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి, శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య, శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య, శ్రీ ముక్తేవి లక్ష్మణదాసు, శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య (అనంతం), శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ, పండిత సత్యనారాయణరాజు ఇత్యాదులనేకులు గోష్ఠీ రసికులయిన తిమ్మరాజుగారి జన్మదినోత్సవాభినందనానికై పుష్పఫలభరితములైన హస్తములతో నిండుహృదయాలతో విచ్చేశారు. తిమ్మరాజుగారిని కూర్చొనజేసి యిష్టదైవధ్యానం చేస్తూ పుష్పఫలాములందించారు. నిమీలితనేత్రుడై సాదరంగా సవినయంగా తిమ్మరాజుగారు అన్నీ అందుకున్నారు. శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు తన 'శ్రీనివాస కల్యాణ' ప్రబంధము సముచితంగా కొంత విన్పించారు. "రమ్యమయిన కవితా గోష్ఠి" అని సదస్యులంతా సంతోషించారు. శ్రీ తిమ్మరాజు సాలోచనదృష్టితో లోలోనిశక్తి గ్రహించుతూ సాభిలాషంగా వినయముద్రతో సావధానంగా శ్రవణంచేస్తూ ఉంటే అందరకూ ఏకాగ్రత కల్గింది. తిమ్మరాజుగారి అనిశ్వాసభావనము, నిర్మాయభావనము చాలా ముచ్చటగా ఉంది. కవితలో చమత్కార సన్నివేశము వచ్చినప్పుడు శనైశ్శిరః కంపంచేస్తూ హాసనిగ్రహానికై ఓష్ఠముద్ర పట్టి జిజ్ఞాసాదృష్టి కలిగి కొంతగా దంతహాసం చేస్తూ పునఃపునః శిరఃకంపం చేస్తూ కవిత నాస్వాదిస్తూ ఉంటే నారాయణాచార్యకవికి అంతఃసంతోషం కలిగింది. "తులసిమానసం చక్కని గేయం. అది గద్యగా వ్రాస్తే శోభింపదు" అని తిమ్మరాజంటూఉన్నప్పుడు 'శివతాండవం' విన్పిస్తున్న నారాయణాచార్యులు రాగతాలయుక్తంగా గేయగానం చేస్తూంటే తిమ్మరాజ హస్తములు తామంతట తాము తాళం వెయ్యసాగినయి. తాలానుగుణంగా కరములకు వలనములు వర్తనములు సంపాదిస్తూ శ్రీ తిమ్మరాజు వింటున్నప్పుడు అప్పటిదాకా దూరానవుండి తనకుతానై వింటూఉన్న శ్రీ హరిశ్చంద్రప్రసాద్ అనుకోకుండా అక్కడికివచ్చి కూర్చున్నారు. అప్పుడు తిమ్మరాజు పుత్రసంక్రాంతదృష్టియై తనవారికందరకు సహజమయిన సారస్వతాసక్తి సమధికంగా తన జన్మదినోత్సవంనాడు సముల్లాసము పొందడంచూచి అంతస్సంతోషమును నిగ్రహించుకొంటున్నారు. దగ్గరనున్న నలుగురు కవులు హరిశ్చంద్రప్రసాద్ నభినందిస్తూ కవుల సమ్మానసభలలో సమధికంగా శ్రద్ధతీసికొనవలసినదని సూచిస్తున్నారు. "మావాడు దూరాన్నుండి ఆస్వాదించగలడు. కవులు కలహించుకొంటారేమోనని మావానికి భయము. స్పర్ధపెట్టుకొని పండితులు ఘర్షణపడతారేమోనని మా ప్రసాద్ సందేహించుట కలదు. మావాని పూనిక

మంచిది. వానికి బెదురుతనము లేకుండునట్లుగా కవి పండితులు పరిశీలించడం యుక్తంగా ఉంటుంది.'' అని శ్రీ తిమ్మరాజుగారనగానే అందరకు చక్కని గంభీరత ఏర్పడ్డది. హరిశ్చంద్రప్రసాద్ గాంభీర్యం అందరిలోనూ సంక్రమించింది మంగళవాద్యాలు గృహప్రాంగణంలో మ్రోగుతున్నాయి. గృహదేవతలు మంగళహారతుల కాంతులను ప్రసరింపచేస్తున్నారు. జన్మదినోత్సవాంగ మయిన కవితాగోష్ఠి మధ్యాహ్నతూర్యధ్వనితో ఆగింది.

## సా య ం త న స భ

సాయంసభ పాలిటెక్నిక్ కళామందిరంలో ఆరంభమయింది. ఊరులోని పెద్దలందరూ విచ్చేశారు. సారస్వతదీప్తి కలిగిన సభ్యులందరూ హాలంతా నిండి ఉన్నారు. మాధవరామశర్మ మొదలయినవారిని సగౌర వంగా సముచిత పుష్పశకటాలలో తీసికొనివచ్చారు. సభాముఖంలో మంగళవాద్యములు ఆరంభమయినయి. సభ్యులకందరకూ మధురపదార్థములను ఫలములను పయఃపాత్రలను కర్పూరతాంబూలములను అందిస్తు న్నారు. శతరూప అయిన హరిశ్చంద్రప్రసాదశక్తి వంద మందిలో సంక్రమించి అందరకూ ఉపాయనముల నర్పించింది. అందరూ ఉచితాసనములలో కూర్చు న్నారు. ఇదివరలో ఎన్నడూరాని పెద్దలు చాలామంది వచ్చారు. మాన్యసభ్యులందరూ పరస్పరం చూచుకొని సభ బాగాఉంటుంది అనుకుంటున్నారు. పండితులలో కవులున్నారు. వారిలో సహృదయులున్నారు. వారిలో ధనవంతులున్నారు. వారిలో విద్యార్థులున్నారు. అంద రిలో అందరూ ఉన్నారు. ప్రసాద్ అందరివాడై పర్య వేక్షణం చేస్తున్నాడు. వనితలు వచ్చారు. విద్యార్థినులు వచ్చారు. అందరకూ పానీయములిచ్చి ఫలములిచ్చి పుష్పములిచ్చి కూర్చొనచేశారు కొందరు సూచీహస్తులై కొందరు నిరీక్షానయనులై సభాసన్నాహం కూర్చిఉంచారు. వేంకటాచలకార్యదక్షత అంతటా స్పష్టమయింది. సభంతా సారస్వతసముల్లాసంతో ఉంది. కాఫీదాతలు వచ్చారు. పుష్పఫలాదులిచ్చారు. ఉద్యోగులు వచ్చారు. సాధికార సభ్యులు వచ్చారు. శాసనసదస్యులు వచ్చారు. సారస్వత తేజస్సు సభలో నిండుగా సాక్షాత్కరించింది, తిమ్మరాజ బంధువులొచ్చారు. వారందరూ యితరులను కూర్చొన చేయడంలో చాలా ఆసక్తి చూపుతూ కార్యవ్యగ్రులై ఉన్నారు.

## స ము చి తా హ్వా న ం

శ్రీ నాదెండ్ల కృష్ణమూర్తిగారు సభారంభోపన్యాసం చేస్తున్నారు. స్వాగతవచనాలు పలుకుతున్నారు. ఉత్సవోచి తంగా సముచితవచనాలు పలుకుతున్నారు. ''మా తిమ్మరాజు గారు యీనాడు కృతి స్వీకారం చేస్తారు. కృతికర్తయైన మాధవరామశర్మ సమర్థుడు. సర్వసమర్థులై చాలా గ్రంథాలు వ్రాశారు. ఆంధ్రభాషకు అవి అలంకారంగా ఉన్నాయి. ఇంతకుపూర్వం వారి గ్రంథాలను లోకం ఆదరించింది. ఈనాడు శ్రీ తిమ్మరాజుగారు ''ఔచిత్య విచారచర్చ'' స్వీకరిస్తారు. కృతి-కర్త-స్వీకర్త చిరస్థా యిగా ఉండాలని తమఆశంస స్పష్టంచేశారు. ''శ్రీ నరేంద్ర నాథ సాహిత్యమండలి అలంకార గ్రంథాలను ప్రక టించింది. అభిజ్ఞుడైన శ్రీ తిమ్మరాజుగారు ఈనాడు ఔచిత్య స్వీకారం చేస్తున్నారు. నిరంతరము కవిపండిత గోష్ఠికి అభిలాష ప్రదర్శించు శ్రీ తిమ్మరాజు నిరంతర వ్యాసంగము గ్రంథప్రకాశనము రాజబంధువులకు ఆదర్శప్రాయంగా ఉంది. మా శర్మగారీనాడు కృతి సమర్పణంచేస్తారు. నారాయణాచార్యులుగారు అధ్యక్షత వహిస్తారు.'' అని అంటూ అలంకారసుందరమయిన వేదికపైకి అందరినీ ఆహ్వానించారు. అందరకూ పుష్ప మాల సత్కారం జరిగింది. సుగంధపరిమళద్రవ్యము లిచ్చారు. శ్రీ గోనెళ్ల రామమూర్తి శాస్త్రిగారు వచ్చి ''హే గోపాలక! హే కృపాజలనిధే'' శ్రావ్యకంఠంతో ప్రార్థనాపద్యం గానంచేశారు. సారస్వతసభలో గోపాలక సంబోధనంతో వారు స్తుతిపద్యం పఠించడం చాలా సముచితంగా ఉంది.

## శ్రీ హ రి శ్చ ం ద్ర ప్ర సా ద్ గా రి స్వా గ తో ప న్యా స ం

శ్రీ హరిశ్చంద్రప్రసాద్ వచ్చి స్వాగతోపన్యాసం చేశారు. (ఇది స్థలాంతరంలో ముద్రితము.)



'శ్రీ తిమ్మరాజుగారికి జన్మదినోత్సవసమయంలో ఉపాయనంగా 'ఔచిత్యవిచారచర్చ'
కృతిసమర్పణం చేస్తున్నాను'' అంటున్న
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు,
'సాహిత్యవల్లభ'
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు.
అధ్యక్షులు :
శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు.
శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారు.



13—10—1963 "ఔచిత్యవిచారచర్చ" కృతిని స్వీకరిస్తున్న

'సాహితీవల్లభ'

శ్రీ ముళ్లపూడి తిమ్మరా గారు.

కృతిప్రదాత:

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గారు.

స్వాగతోపన్యాసం వింటూవుంటే తణుకు ప్రాధాన్యత, తిమ్మరాజు వైభవం, నరేంద్రనాథ భావనం, మండలిభావము, దేశాభ్యుదయము, సారస్వతాభ్యుదయము, మాధవరామశర్మ వ్యవసాయము బాగా స్పష్టమైనవి. సభ్యులందరూ జయవాదము పెట్టు దృష్టికలవారైనారు. వారందరి ఆశీస్సులు కాంక్షించుతూ హరిశ్చంద్రప్రసాద్ పలకటం సముచితంగా ఉంది.

## ప్రారంభోపన్యాసం

శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య ఎం. ఏ., బి. ఇడి, ప్రారంభోపన్యాసం చేశారు. బ్రహ్మ సృష్టిని, కవిసృష్టిని స్పష్టంచేసి సాహిత్యవేది అనే భావంతో సర్వ కవితావాదములను పలికి ఉక్తి వైచిత్ర్యమును కవితాసూత్రంగా నిరూపిస్తూ కవిసామర్ధ్యం ఉక్తి వక్రతలో ఉంటుందని నిరూపించారు. 'విశ్వశ్రేయః కావ్యం' అనే సూక్తి నందుకుంటూ కావ్యవస్తువును నిర్దేశించడంలో కవి భావక భావ్యమానమైన వస్తువేదైనా వస్తువే అని స్పష్టంచేశారు. మాధవరామశర్మ సాహిత్య కృషిని విస్తరించి అన్యరాష్ట్రములవారి యత్నమును పరిశీలించి అలంకార శాస్త్రరచనలో మా శర్మ విశిష్టతను విశదంచేశారు. సాహితీపోషకులైన సాహితీవల్లభులైన శ్రీ తిమ్మరాజుగారి జాతీయతాదృష్టిని కళాపోషకతను దేశోపయోగ కార్యములను ఇతరోద్యమములకు అందించే ప్రోత్సాహమును స్పష్టంచేశారు. (ఈ ప్రారంభోపన్యాసము విడిగా ముద్రితము.)

## అధ్యక్ష నారాయణుడు

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు అధ్యక్ష నారాయణుడై ఈవిధంగా ఉపన్యసించారు. మా శర్మ మా మిత్రుడు అతనిహార్దదృష్టి, మైత్రి, తిమ్మరాజ సౌహార్దము, మిత్రుల సమాదరం నారాకకు కారణం. తెలుగు మాత్రమే ముఖ్యము కాదు. దాక్షిణభాషలన్నీ కూడా ఆ భాషా భాషులకు ముఖ్యములే. ఆంధ్రభాషలో అజంతత ఉండవచ్చు కేవలము ఆంధ్రమే లలితము అనుకో నక్కరలేదు. అరవంకూడా లలితమే. ప్రాకృతభాషలో మంచి మాధుర్యం ఉంది. 'శిలప్పధికారం' పరిశీలిస్తే దాని గొప్పదనం తెలుస్తుంది. కన్నడభాషలోని 'షట్పది' చాలా మనోహరము. ఈనాటి కవులు అన్నీ నేర్చుకోవాలి. మళయాళంలోని భాషామాధుర్యం వల్లతోల్ వంటివారు విశదంగా నిరూపించారు. ఇట్లాగా అన్ని భాషలలోను మాధుర్యం ఉన్నది. తిక్కన సారస్వతమును, కన్నడంలో కుమారవ్యాస సారస్వతమును సమీక్షచేసి జాగ్రత్తగా గుర్తించడం అవసరం. కేవలము స్వాధిక్యదృష్టి అంత మంచిదికాదు. నేను తాతాచార్య వంశములోనివాడను. అంతర్వేది వైష్ణవులు, కోరుకొండ వైష్ణవులు ఒకప్పుడు మా వంశాలవారు. వారి వైష్ణవధర్మ విశేషాలను శ్రీ ముళ్లపూడివారున్నూ గుర్తించేవుంటారు. నేనిప్పుడు ఆస్థలానికై వచ్చాను. తెలుగుదేశంలో కమ్మ ప్రభువుల విశిష్టత చాలా అభినందనీయం. వీరిపై ఏదో విధంగా తాతాచార్యముద్ర ఉన్నదని భావిస్తున్నాను. మా మాధవరామశర్మ బహుజన సమారాధనమునకై అనేక సంవత్సరాలుగా యత్నం చేస్తున్నాడు. ఔచిత్య విచారచర్చ కృతిసమర్పణం నాకు చాలా సంతోషకరంగా ఉన్నది.

## కృతిసమర్పణం

అధ్యక్షుల సూచనంతో శ్రీ తిమ్మరాజ సంకేతంలో శ్రీమాన్ హరిశ్చంద్రప్రసాద్ అటు చూడగానే కల్యాణ మంగళవాద్యాలు మ్రోగుతూవున్నాయి. నాదవిద్వాంసులు నాదానుసంధానంతో రాగాలాపం చేస్తున్నారు. శ్రీ హరిశ్చంద్రప్రసాద్ అందించగా పూజావస్తువులను వేదికపైనున్న వారందరూ అందుకున్నారు. సముజ్జ్వలవేషంతో ఉన్న మాధవరామశర్మ హసన్ముఖుడై సాహితీదృష్టితో కృతిసమర్పణ సమయంలో సముచితంగా అనుసరింపతగిన విధానములనన్నిటిని యథోచితంగా అనుసరించడం సభ్యులకు ముచ్చటగా ఉంది. గంధపుష్పాదులందించి నవీనవస్త్రములనందించి పుష్పమాల నలంకరించి, ఫలములతో, పుష్పములతో ఔచిత్యవిచారచర్చ గ్రంథము శ్రీ తిమ్మరాజుగారికి ఉపాయనంగా సమర్పించారు. మంగళతూర్య నినాదములు సదస్యల సదస్యుల సంతుష్టి సూచక కలకలస్వనములతో కలసి సమకాలంలో సర్వ సంతోషమును సంపాదించినవి. కృతిస్వీకారం చేసిన

జన్మదినోత్సవ శోభాసుందరుడైన శ్రీ తిమ్మరాజుగారు మాధవరామశర్మగారికి గ్రంథముద్రణ పర్యాప్తమైన ద్రవ్యమును, నవీనవస్త్రములను రాజతాంబూలమును సత్కారంగా బహూకరించారు. ఈనాటి బహూకరణములో క్రొత్తవిశేషమొకటి బాగా గోచరించింది. శ్రీ శర్మగారికి ప్రోత్సాహజనకంగా అందరకూ ఆదర్శప్రాయంగా శ్రీ తిమ్మరాజుగారు సత్కారం చేశారు. రచయిత అయినవానికి పోషకుడైన వ్యక్తి చేయవలసిన సత్కారం ఈవిధంగా ఉండాలి అని అందరూ అనుకునేటట్లు సత్కారం జరిగింది. ఒక గ్రంథం వ్రాయడానికి తగినన్ని తెల్లకాగితాలు, ఫౌంటెన్ పెన్, ఇంకుబాటిల్, పెనసళ్ళు, రంగుపెనసళ్ళు, స్కేలు, గుండుసూదులు, భద్రపరచడానికి ఒకఫైలు, అన్నిటినీ గుప్తపరచడానికి ఒక లెదర్ బేగ్ ఇత్యాదిగా సారస్వత లలిత సత్కారం చక్కగా జరిగింది. భద్రంగా అన్నిటిని తిమ్మరాజ దృష్టి హరిశ్చంద్రప్రసాద హస్తముతో సత్కారముగా సమర్పించింది. శ్రీ యర్రమిల్లి వెంకటాచలంగారు అన్నిటినీ తగిన సమయంలో జతపరచి అదిగో పైకము, అదిగో కలం, అది గోసిరా, ఇదిగో అద్దుడుకాగితం అని ప్రత్యేక ప్రత్యేకంగా అన్నిటినీ జాగ్రత్తగా చూపించారు. మంగళ వాద్యాలు మ్రోగుతూ ఉన్నాయ్.

## కృతిప్రదాత - శ్రీ మాధవరామశర్మ

శ్రీ మాధవరామశర్మ తన కంఠానికి కంఠం కలుపుకొని సంస్కృతభాషలో సారస్వతేయులను, సరస్వతీపుత్రుని, సాహితీవల్లభుని, సంబోధనంచేస్తూ ఉపక్రమించారు. "నేనొక విశిష్టమైన వంశవైభవం కలవాడను. విశిష్టమైన వంశప్రశస్తికల శ్రీ తిమ్మరాజుగారికి జన్మదినోత్సవ సమయంలో ఉపాయనంగా ఔచిత్యవిచారచర్చ కృతిసమర్పణం చేస్తున్నాను. నేను గ్రంథరచనా దీక్ష కలవాడను. చాలాగ్రంథాలు వ్రాశాను. చాలా కృతిసమర్పణములు చేశాను. ఆనాడు ముక్త్యాలలో శ్రీ చల్లపల్లి రాజావారికి ప్రతాపరుద్రీయ గ్రంథం కృతి ఇచ్చాను. ఆనాటి సభ ఈనాడు గుర్తువస్తున్నది. ఈసభ అంతా నాకొఱకై జరుగుతున్నదని నాకెందుకో భావావేశం కలుగుతున్నది. ఈసభ శ్రీ తిమ్మరాజ జన్మదినోత్సవ సభకావడం అన్నింటికన్నా గొప్పగా ఉన్నది. నేనొక సారస్వత సముద్యమం సంభావిస్తున్నాను. భాషావైవిధ్యానికై యత్నం చేస్తున్నాను. నేనున్న స్థలము తపోవనము. నాసాధనం ఒక తపస్సు. నేను ఒక సాహిత్యతాపసుడను. ఔచిత్యభావనంచేసి ఈ కృతిసమర్పణం చేస్తున్నాను. నా యీ గ్రంథంలో 220 పుటలున్నాయి. ఇరవైమంది కవుల ఉదాహరణముల పరిశీలనం ఉన్నది. ఇరవైముగ్గురు కవుల శ్లోకాలు ప్రత్యుదాహరణరూపంగా దీనిలో ఉన్నయ్. మొత్తం శతాధికంగా పద్యాల సమీక్ష దీనిలో ఉన్నది. ఇది ఔచిత్యవిచారచర్చ. ఉచితానుచిత వివేకం ఉంటే మంచి వ్యుత్పత్తివున్నట్లు అనుసంధానం లేనివానికి భూషణమైనా దూషణమే. సావధానంగా ఉండేవానికి దూషణమైనా భూషణమేనని ప్రాచీనులన్నారు. కవుల అనుసంధానమును పరిశీలించడం అవసరమని ఈగ్రంథమును ఈవిధంగా ప్రకటిస్తున్నాను. సారస్వతైక్యసంధానచతురా! సహృదయ సృష్టి కొరకై మీయత్నము నాయత్నము సఫలమౌగావుత. స్వస్పంద సౌందర్య ప్రతిష్ఠకై మీరు యత్నిస్తున్నారు. నాయత్నమూ అందుకొఱకే. మీరు పాండిత్య రక్షణానికై కృషిచేస్తున్నారు; ప్రోత్సాహం ఇస్తున్నారు. మీవంటి ప్రోత్సాహం ఇచ్చే ప్రభువులుంటే ఎంతగానైనా పాండిత్యం అభివృద్ధి పొందుతుంది. అచేతనమైన మద్దెలకూడా అన్నంలో మన్నుకలిపి ముఖంలో చేతితో కొట్టు కొట్టి పెట్టినా సచేతనంగా ఎన్నో పలుకులు పలుకుతున్నది. సచేతనులైన యీ పండితులందరూ తగిన అన్నముకలవారైతే ఎంతగానైనా వాగారాధనము చేయగలరు. శ్రీ జాయపసేనాని రచించిన నృత్త రత్నావళి ముద్రితమై కూడా మదరాసులోనుండి బైటికిరాలేదు. శ్రీ హరిశ్చంద్ర ప్రసాద్ ఆ గ్రంథమును తమఇంటికి చేర్పించితే దానిని యేమిచేయవలెనో శ్రీ తిమ్మరాజుగారు నిర్ణయంచేస్తారు. రాజబంధువులందరూ బాగా భావించి తణుకు పట్టణంలో కూడా గ్రంథప్రకాశనానికై ఒకనిధి యేర్పరచితే రచయితల గ్రంథాలు సుప్రకాశితములు కాగలవు." అని గంభీరంగా పలికి ఔచిత్య విచారచర్చ గ్రంథంలో ఉపాయనంగా వారు వ్రాసిన శ్లోకాలను చదివి వ్యాఖ్యానించారు.



శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

"శ్రీవిశ్వవిచారచర్చ" కృతిస్వీకృతి శుభమహోత్సవ సభాసందర్భమున

# విద్వన్మహాకవిపండితపరిషత్తు

శ్రీనరేంద్రనాథసాహిత్యమండలి వ్యవస్థాపకులు విద్యాపోషకులు

ప్రజాసేవాపరాయణులునగు

## శ్రీముళ్లపూడి తిమ్మరాజుచౌదరి గారికి

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులగారిచే నిప్పించిన

# సాహితీవల్లభ

## బిరుదు ప్రదానము

తణుకు　　　　ఇట్లు

13-10-1963　　　　విద్వత్కవిపండితులు

1. పుట్టపర్తి నారాయణాచార్యులు
2. [illegible]
3. [illegible]
4. [illegible]
5. [illegible]
6. [illegible]
7. [illegible]
8. [illegible]
9. [illegible]
10. [illegible] రామమూర్తి శాస్త్రి
11. [illegible]
12. [illegible]
13. [illegible]
14. [illegible]
15. [illegible]
16. [illegible]





సభకు సంపూర్ణత్వం యేర్పడింది. కృతి సమర్పణం అందరి నేత్రాలలోను రమణీయ ఆకారంతో స్థిరంగా నిలచి ఉన్నది.

తర్వాత గండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఔచిత్యం లోకంలోకూడా ఉన్నదని కావ్యంలో ఔచిత్యం క్షేమేంద్రుడు నిరూపించిన రీతిలో మాధవరామశర్మ నిరూపించారని, కొన్నికొన్ని సందర్భాలలో మాధవరామశర్మ క్షేమేంద్రుని భావమునుకూడా పరిష్కరించుతూ ఇంకా విశేషంగా చెప్పిన విషయాలున్నవని సోదాహరణంగా నిరూపించారు. తర్వాత

శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు,
శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ,
శ్రీ పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి,
శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య,
శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి,
శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య,
శ్రీ ద్వివేది సూరి,
శ్రీ బి. శ్రీమన్నారాయణమూర్తి,
శ్రీ కాకాని నరసింహారావు,
శ్రీ చిరంజీవి వేంకటసూర్యనారాయణరాజు.
శ్రీ టి. యస్. అప్పారావు,
శ్రీ గోనెళ్ళ రామమూర్తిశాస్త్రి,
శ్రీ ఆకెళ్ళ పార్వతీశము,
శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

ప్రభృతులు. మరికొందరుపన్యసించారు; పద్యోపహారాలు సమర్పించారు.

## 'సాహితీవల్లభ' బిరుద సమర్పణము

శ్రీ తిమ్మరాజుగారి జన్మదినోత్సవము నభినందిస్తూ వారి బంధువులు, ఊరిలో చాలా సంఘములవారు స్వాగతపత్రాలు సమర్పించారు. సన్మానపత్రాలు అందించారు. శ్రీ తిమ్మరాజుగారికి వైభవోపేతంగా వస్త్ర తాంబూలాలను అందించారు. అపూర్వ వైభవంతో సభసాగింది. శ్రీ తిమ్మరాజుగారికి సభాధ్యక్షులు, ఉపన్యాసకులు, సభ్యులు సంపూర్ణ సహకారంతో 'సాహితీవల్లభ' అనే బిరుదు సమర్పించారు.

## శ్రీ తిమ్మరాజుగారి కృతజ్ఞత

శ్రీ తిమ్మరాజుగారు కృతిస్వీకర్తగా చాల విశేషాలను గంభీరంగా ఉపన్యసించారు. "నేను వినగలను. పలుకలేను. మీలో కూర్చోగల యోగ్యతను గురువులు కలుగజేశారు. కొందరిదగ్గర సంస్కృతం చదువుకున్నాను. ఒక్కొకచోట రెండు శ్లోకాలతోనే పూర్తిఅయింది. నా నరేంద్రునివలన నాకు కొంత ఉద్బోధం కలిగింది. ఉపాధ్యాయులకు ఎక్కడైనా అవమానం కలిగితే నేను సహింపలేను. ఉపాధ్యాయులు తప్పుచేయరని నాకు నమ్మకం. నా పరిచితులు నాకు చాలా ఇష్టం, వారు తప్పించుకు తిరిగినా నేనే వెంటపడుతాను. లోకంలో భేదాభిప్రాయాలుంటే తగ్గించాలి గాని పెంచకూడదు. రచయితలకు ఐకమత్యం కలిగితే ఎంత సృష్టియైనా రాగలదు" అని ఉపన్యసిస్తూ తమ సారస్వత ఆసక్తిని ప్రోత్సహించాలన్న అభిప్రాయమును స్పష్టం చేశారు. సభ పూర్తయింది. అందరూ ధన్యవాదాలర్పించారు.

# స్వాగతోపన్యాసము

శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్ర ప్రసాద్

అధ్యక్ష మహాశయా !

పూజ్యా సభాసదులారా !!

మా ఆహ్వానము మన్నించి, దూరభారములు లెక్కింపక దయచేసి, సభకు అలంకారము సమకూర్చిన మీకు అందరకును మా హృదయపూర్వక స్వాగతము.

పవిత్ర గోస్తనీ తీర క్షేత్రమనియు, ఆదికవి నన్నయభట్టారక మహాకవి యజనముచేసిన చోటనియు, కవులకును, గాయకులకును, నాయకులకును, త్యాగులకును, భోగులకును నిలయమనియు, పశ్చిమ గోదావరి జిల్లాకేకాక యావదాంధ్ర ప్రదేశమునకును తలకుతెచ్చు నగరమనియు మా తణుకుగూర్చి నేను క్రొత్తగా చెప్ప నక్కఱలేదు.

తమముందు సాహిత్య ప్రాధాన్యముగూర్చికాని, కవి పండిత సమ్మాన ప్రాముఖ్యము గుఱించికాని వేఱే వివరించుటయు అవసరముకాదు.

సంసార విషవృక్షమునకు రెండే రెండు అమృత తుల్యములైన ఫలములు కలవనియు, వానిలో నొకటి కావ్యామృత రసా స్వాదమనియు, రెండవది సజ్జనుల తోడి సల్లాపమనియు పెద్దలవాక్కు. ఈ రెండు ఫలముల రసములను గ్రోలుటయందును మొదటినుండియు రుచిమఱిగినవారు మా నాయనగారు. వారికిగల కావ్య కవి పండిత ప్రీతియే వారిని, మమ్మును సాహిత్య బంధువుల జేసినది.

నేను తలచిన సత్కార్యము లెల్లను సఫలము లగుటయును, చేసిన దెల్లను బహుజనులకు సుఖ సంతోష లాభదాయక మగుటయును మా తాతగారు శ్రీ వేంకటరాయుడుగారి మారు రూపమయిన మా నాయనగారి ఆశీర్వచన ఫలమే; ఆజ్ఞాఫలితమే.

ఈ నా పారిశ్రామిక, రాజకీయ, ప్రజాసేవా రంగములందలి సర్వ కార్యభారమును వహించుటలోను లక్ష్మణునివలె నాకు చేదోడు వాదోడు కాగల మా సోదరుడు నరేంద్రనాథుడే నేఁ డుండినచో .... .... నేను మా నాయనగారి ఈ జన్మదినోత్సవ – కృతి స్వీకరణోత్సవములకు తమకు స్వాగతము పలుకగా అతడు కృతజ్ఞతా వందనము లర్పించుచో .... .... ఎటు లుండెడిదో ! — ఆ అదృష్టము మాకు లేదు.

సప్త సంతానములలో పుత్రుడు తనరూపే గనుకను, వంశకర్త గావునను ఇహ పరానంద గ్రంథి కావునను ముఖ్యుడు. ఖిలము గాకుండునది గావున, కృతిప్రశస్తము; ప్రధానము. ఈ రహస్య మెఱిగిన మా నాయనగారి పుత్రప్రేమ అఖిలకృతి సంతాన ప్రకాశనమునందును లగ్నమయి ఆ పుత్ర ప్రకాశ తృప్తిని పొందగోరినది. ఆ సంకల్ప ఫలమే ఈ నరేంద్రనాథ సాహిత్యమండలి. ఆ సంకల్పబలమే దీని దినదినాభివృద్ధి.

మన దేశము స్వతంత్రమయినది. కాని, కేవల రాజకీయ స్వాతంత్ర్యము నిజమయిన సంపూర్ణమయిన స్వాతంత్ర్యము కాదనియు, అది ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, పారిశ్రామిక స్వాతంత్ర్యములతో పరిపుష్టము కావలె ననియు, కానిచో, కేవల రాజకీయ స్వాతంత్ర్యము తన్ను గట్టుత్రాళ్ళు తానే తెచ్చుకొనుటకు మాత్రమే ఉపయోగించు ననియు, మన దేశ నాయకులు పదేపదే ఉద్ఘాటించుచున్నారు. నా దృష్టికి భాష విషయమును ఇట్టిదిగానే గోచరించుచున్నది. మన




సదస్యులకు స్వాగతం పలుకుతున్న
శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారు, ఎం. ఎల్. ఏ.



'సాహితీవల్లభ' శ్రీ ముక్తపూడి తిమ్మరాజుగారిని

చిట్టూరి ఇంద్రయ్య, V. M. గారు.

## స్వా గ తో ప న్యా స ము

భాష సర్వ సంపన్నమైన, సర్వోపయోగిమైన, పరిపుష్ట మైన భాష కావలె నన్నచో దానియందు కేవల కావ్య ములు మాత్రమే ఉండుట చాలదు. అన్ని విధములైన గ్రంథములును విరివిగా రావలెను. తెలుగు గావలెను. వెలుగునకు రావలెను. ఈ అభిప్రాయముతోడనే శ్రీ పెన్మెచ్చ సత్యనారాయణరాజుగారి 'రాజానందము', శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారి 'బుద్ధగీత' వంటి వానితోపాటు శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారి 'మధుర స్మృతి' రూపమైన 'మాబడి' వంటి సరస గద్యకృతులను, మన సంస్కృతీ రక్షణను ఉద్బోధించు శ్రీ గోకులపాటి కూర్మనాథకవి రచించిన 'సింహాద్రి నారసింహ శతకము' నీతిపేటికయగు భద్రభూపాల విరచితమైన 'నీతిముక్తావళి' వంటి వానిని; శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారి 'ఆర్యచాణక్యుడు, కాకతి ప్రోలరాజు' వంటి చారిత్రకము లయిన నవలలను, ఈ మండలి ప్రకటించినది. ఇంకను "గోస్తనీ మాహాత్మ్యము, శివయోగసారము, ముసునూరి కాపయ, సోమదేవరాజీయము" వంటి వివిధములయిన గ్రంథములను ప్రకటింపనున్నది.

ఇట్టి ఈ సమగ్ర దృక్పథమే ఈ కృతిస్వీకరణము నకు మా నాయనగారిని ఉత్సాహముతో సమ్మతింప జేసినది. సంస్కృతభాషయందు పండితులుగా, అనర్గళ ధారగల వక్తలుగా, యావద్భారత మహాపండిత సభలలో ప్రశస్తికెక్కిన శ్రీ జమ్ములమడక మాధవ రామ శర్మగారు తెలుగులో అలంకార శాస్త్ర గ్రంథములన్నియు లేని లోటు తీర్పబూని ఆ ప్రయత్నమునందలి ఒక మజిలీ యగు "ఔచిత్య విచార చర్చ"ను మా నాయనగారికి అంకితము చేయదలచుటతోడనే అట్టి ఉద్దేశముతోడనే ఈ నరేంద్రనాథ సాహిత్య మండలిని నిర్వహించుచున్న మా నాయనగారు వెంటనే అంగీకరించి, మే మెల్లరము జరిపికొను వారి యీ 61వ జన్మదినోత్సవమునకు నూతన శోభ కలుగు అవకాశమిచ్చిరి.

మేము కోరినంతనే అంగీకరించి, బహు భాషా వేత్తలును, సరస్వతీ పుత్రులును, మహాకవులును అగు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు దయచేసి అధ్యక్ష స్థానము నలంకరించి ఉన్నారు.

మా ప్రార్థన మంగీకరించి పండితులును, సుకవు లును ఈ సభలో వివిధవిషయములపై ప్రసంగింప విజయముచేసి ఉన్నారు.

మా ఆహ్వానము మన్నించి సహృదయులగు తాము ఎల్లరును ప్రశాంతములయిన హృదయములతో దయచేసి సభా కార్యక్రమము జయావహమొనరింప నున్నారు.

ఇట్టిచోట, మా నాయనగారి ఈ జన్మదినోత్సవ శుభవేళ, ఇట్టి సత్సంకల్ప పూరితమయిన ఈ కృతి స్వీకరణ సమయమున, అనంత వాఙ్మయ ప్రజాసేవ చేయుటకు వీలుగా, ఇంకను ఇట్టి యెన్నెని జన్మదినోత్స వములలో పాల్గొని శతాయువు లగునట్లు మా నాయన గారిని, మమ్ములను ఆశీర్వదింప గోరుచు, మఱియొక మారు వినమ్రుడనై మీ కెల్లరకును స్వాగతము పలుకు చున్నాను.

# ప్రారంభోపన్యాసము

శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య

అధ్యక్షమహోదయా !

మహాజనులారా !!

విచిత్రమైనది మానవుల నెక్కువగా ఆకర్షించును. అట్టి విచిత్రమయినవానిలో మిక్కిలి వింతయయినది పరమేష్ఠిసృష్టి. కాని ఆ సృష్టిలోనివాఁడయిన కవిసృష్టి ఆ పరమేష్ఠిసృష్టికంటె గూడ ఉత్కృష్టమైన దని తేల్చినారు. బ్రాహ్మసృష్టిలోని పద్మములు మున్నగు వస్తువులు కొన్నినియతములయిన లక్షణములు గలిగి యున్నవి. ఇందు సంతోషవిషాదము లున్నవి. దీనికి పారతంత్ర్య మున్నది. ఇందలి రసములు (రుచులు) అతే. అందును అన్నియును స్వాదువులును ఉపభోగ్యములును కావు. చేదువంటి పరిహార్యములును ఉన్నవి. ఇక కవిసృష్టి చూడుఁడు. ఇం దట్టినియమములు లేవు. ఇందు కరుణాదు లున్నను పాఠకునకు వానివలన గలుగునది కేవల మానందమే. ఇది స్వతంత్రమయినది. ఇందు శృంగారాది రసములు తొమ్మిది యున్నవి. అన్నియు స్వాదువులే, ఉపభోగ్యములే, అపరిహార్యములే. కనుక కవివాక్కుచే నిర్మితమయినసృష్టి సర్వాతిశాయి యయినది.

కవియొక్క అట్టి సర్వాతిశాయియయినసృష్టినే - కృపినే - 'కావ్యము' అనుచున్నారు. ఏది కావ్యము? అను ప్రశ్న కనేకులు అనేకనిర్వచనముల నిచ్చి సమాధానమును క్లిష్టమును సుస్పష్టమును చేసియున్నారు. శాస్త్రదృష్టితో నవి యెట్టివియయినను సామాన్యలోకవ్యవహారమున కవిత—కావ్యము అనునవి ఇంచుమించు పర్యాయములుగనై కవితఅన్నను కావ్యమన్నను అర్థబోధ అగుచునే యున్నది. అధునికులు తమతమమార్గముల సమర్థించుకొనుట కెక్కువగా నుపయోగించునవి 'రసాత్మకమయిన వాక్యమే కావ్య' మనునది యొకటియు, 'రమణీయార్థప్రతిపాదక మగు శబ్దమే కావ్య' మనునది ఇంకొకటియు. రసము, గుణము, అలంకారము, వక్రోక్తి - ఇట్టి వీనిలో దేనియం దెక్కువ ప్రీతికలవారు దానికి ప్రాధాన్య మొసగుచు కావ్యలక్షణము నిర్వచించినారు. కావ్య మొక అనేకానిర్వచనీయములైన రుచులు గల భక్ష్యవిశేష మనుకొన్నచో ఏ రుచిపై ఎక్కువ మక్కువ గలవా రా రుచికే ప్రాధాన్య మిచ్చి వర్ణించిరని చెప్పవలయును. వీరిలో బహువిద్వదంగీకృతమైన 'రమణీయార్థప్రతిపాదక మయిన శబ్దమే కావ్య' మనినవాఁడు మనఆంధ్రుడు జగన్నాథపండితరాయ లగుట మన అదృష్టము. అంతే కాదు, ఈ ప్రస్థానములో ఎవరును త్రొక్కని దారిత్రొక్కి ఎల్లకావ్యములకును, ఎల్లభాషలకును, ఎల్లకాలములకును సరిపడునట్టి నిర్వచన మిచ్చినవాఁడు మఱియొక ఆంధ్రుఁడే అగుట మఱియు విశేషము. 'అదోషములు సాలంకారము లయినవాగర్థములు విశ్వశ్రేయస్కరములు కావ్యము' అన్నది ఆ నిర్వచనము. దీనిని చెప్పిన నన్నయయు పండితరాయల వలె గోదావరీతీరమువాఁడగుటయు వింతకలయికయే. ఈ నిర్వచన మొక ఆంధ్రమునకుపయోగించు లక్షణగ్రంథమున చేయబడినది కనుక ఆంధ్రమునకే పరిమితమయినది కాని ఇదే సంస్కృతకావ్యవిషయక మగు మఱొకగ్రంథమునందలిది యగుచో సర్వభారతము నందును సమ్మాన్యమయి యుండెడి దనుటలో సందేహము లేదు.

ఆ యీ సర్వాభిప్రాయములను పరికించినపిదప సామాన్యనకర్థ మగు రీతిని స్థూలముగా విశదముగా మన మనుకొనవలయు నన్నచో "విశ్వశ్రేయ స్సాధనమైన రమణీయ మయిన అర్థమును నిర్దుష్టముగా చమత్కారముగా చెప్పు శబ్దము కావ్య" మనుకొనవచ్చును చమత్కా




ప్రారంభోపన్యాసమిస్తున్న
శ్రీ యేలూరిపాటి అనంతరామయ్యగారు.
ఆసీనులైవున్న
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు.
'సాహితీవల్లభ'
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారికి
సన్మానపత్రం సమర్పిస్తున్న
శ్రీ వి. జి. మోహన్‌రాజ్ గారు,
ప్రిన్సిపాల్, యస్. యమ్. వి. యమ్. పోలీటెక్నిక్ కళాశాల, తణుకు.

రముగా చెప్పుట అనుదానినే ఉక్తివైచిత్ర్య మనియు నన వచ్చును. ఉక్తివైచిత్ర్య మింత ప్రధానముగానిచో రామాయణ భారత భాగవతములు రచించిన పిదప మఱియొక రచన రానక్కఱ లేదు. కాని వచ్చినవి, వచ్చుచున్నవి. లోకము, విద్వల్లోకము మెచ్చినది, మెచ్చుచున్నది.

అట్టి కావ్యమునకు వస్తువుగా గ్రహింపదగిన దేది? అను విషయమునఁ గూడ అనేకములయిన వాదోపవాదములు వినిపించుచున్నవి. "నీ వీ వస్తువునే గ్రహింపు" మని ఒకరిచే నియమింపఁబడఁదగినవాఁడు కవిమాత్రము కాఁడు. అతనికంటికి "కవిచూపు" ఉండవలయునే కాని కవితకు పనికిరానివస్తువు లేదు. 'రమ్యము, జుగుప్సితము, ఉదారము, నీచము, ఉగ్రము, ప్రసాది, గహనము, వికృతము-ఎట్టిదయైనసరే-వస్తువు కాని, అవస్తువు కాని, కవిభావకభావ్యమానమై, రసభావమందనిది లోకమందులే' దన్నది ఆలంకారికమూర్ధన్యులు నొక్కి చెప్పినది. ఈ మాట చాలమంది మఱచిరి. లేదా మఱచిరను భ్రమ కలిగించిరి. కావుననే శ్రీ శ్రీ "కుక్కపిల్లా, సబ్బుబిళ్ళా, అగ్గిపుల్లా, కాదేదీ కవిత కనర్హం, ఔనౌను శిల్ప మనర్ఘం" అని చెప్పినది క్రొత్తవలె భాసించినది. శ్రీ శ్రీ చెప్పినది క్రొత్తది కాదని చెప్పి ఆ చెప్పుట కపకర్షనాపాదించుట కాని, చెప్పుట అనవసర మనుట కాని నా యభిప్రాయము కాదు. ఇట్టి దృష్టి మన ఆలంకారికుల కున్నదో లేదో తెలియనితనమున పడిపోవుచున్నవారి కది చక్కఁగా జ్ఞప్తి కెలయించినది.

అట్టి కవితచెప్పుటకు కేవలశాస్త్రజ్ఞానాభ్యాసములు చాల వన్నది అందఱును అంగీకరింతురు. పూర్వజన్మసంస్కారమువంటి శక్తి యేదో సహజమైనది యుండవలయు ననియు నందఱు అందురు. కాని ఆ శక్తికి, ఆ ప్రతిభకు సముచిత మయిన బలమును వ్యుత్పత్త్యభ్యాసముల ద్వారమున సంపాదింపవలయు నన్నది చాలమంది విస్మరించు చున్నారు. లేదా విస్మరించి నట్లు, అవసరమే లే దన్నట్లు కారణాంతరములవలన నటించుచున్నారు.

ఒక గురువునొద్ద నిరువురు శిష్యు లుండిరి. ఇరువురును సాహిత్యవిద్యాపారంగతు లయిరి. ఇరువురకును కవులము కావలయునను కోరిక యుదయించినది. గురు నను జ్ఞ కోరిరి. గురువు ఎదుట నున్న యెండు చెట్టు చూపి 'అదియేమి' యని యొక్కొక్కనినే విడివిడిగా నడిగెను. ఒకఁడు "శుష్కో వృక్ష స్తిష్ఠ త్యగ్రే" అనఁగా రెండవవాఁడు "నీరస తరు రిహ విలసతి పురతః" అనెను. రెండు వాక్యములకును "ఎదుట నెండు చెట్టున్న" దనియే అర్థము. కాని, ఇందు రెండవది దానిని పుష్పింపఁజేయునదిగాను, మొదటిది నఱకునట్టిదిగాను నున్నవని సంస్కృతము రాకున్నను విన్న ప్రతి మానవునకును తెలిసిపోవును. కావుననే ఆ గురువు మొదటి వానికి శాస్త్రపాఠనమును, రెండవవానికి కవితాభ్యాసమును విధించెను. కవితాసాధనకు పనికివచ్చువారును పనికిరానివారును నిట్లుందురు.

కవితారచనకు సెంత శక్తియుక్తులును సామర్థ్యమును అవసరమో కవితావగాహనమునకును కవితాపరీక్షకును అంతగనే అవసర మను సంగతి చాలమంది గుఱుతించినట్లు అగుపించుటలేదు. వైద్యపరీక్షయందు త్తీర్ణుడుకానివాడు చేతకాని వైద్యమువలన రోగిని చంపినచో ప్రభుత్వ మూరకొనుట లేదు. న్యాయవాదపరీక్షాపట్టభద్రుడు కాక, నీలకవచధారి కాక కోర్టులో వాదింతు నన్నవానిని న్యాయవాదిగా నంగీకరించుట లేదు. కాని కవిత మంచిచెడులను నిర్ణయించుటకును కవితను చెప్పుటకును మాత్రము తలలో నేమియులేకున్నను తలయున్న చాలు నని చాలమంది అనుకొనుచున్నట్లు ఉన్నది.

ఇది చాల ప్రమాద మని యెల్లరును గుర్తింపవలసియున్నది. ఇటు సాధకులకును, అటు పాఠకులకును సామర్థ్య మిచ్చుటకు అలంకారాదిశాస్త్రములు అనేకములు మనవారు సంపాదించిపెట్టిరి. "అవి యన్నియు మనకు ఉపయోగించునవి కావు. ప్రాత చింతకాయపచ్చడు" లని త్రోసివేయుట వివేక మనిపించుకొనదు. సాహిత్యదారిద్ర్య మను రోగము పోవలయునన్నచో పథ్యముగా నైనను వానిని స్వీకరింపక తప్పదు. పోనీ, అవి పనికిరాని వని నిర్ణయముచేయుట కైనను అందేమి యున్నదో ఒకమాఱు చూచి మఱి చేయవల

యునుగదా! చూచినచో అతినవ్యము లని మనము అనుకొనున వెన్నియో అమూల్యరత్నములు మనపూర్వులు మనకై దాచిన పాతులలోనివే అని ఆనందము కలుగక మానదు.

ఇదివఱకు తెలుగులో రచనచేయువానికి విధిగా సంస్కృతము వచ్చియుండెడిది. సంస్కృతము వచ్చినవాఁడు తప్పక రచయిత కవసరమయిన సర్వవిషయములు అందున్నవి తెలిసికొనువాఁడు. ఇప్పటి రచయితలలో చాలమందికి సంస్కృతముతో నవసరములేకున్నది. వారి నందఱను సంస్కృతము చదువుకొనుఁ డను వెఱ్ఱివాఁడను నేను కాఁబోను గాని, కనీసము అందున్న విశేషములను తెలుగులోనికి - ఇదివఱకే వచ్చినచో సరేసరి రానిచో - రప్పించుకొనియైనను పరిశీలింపుఁ డని కోరుట దోషము కా దనుకొందును. రచయితతోపాటు రసజ్ఞుఁడును నేర్చుట అతని రసజ్ఞతకే వన్నెవెట్టును. తెలియక ఎవరినో చూచి వారు మెచ్చిరి కనుక మెచ్చినదానికిని తెలిసి తానై మెచ్చినదానికిని భేద మున్నది.

వంగ మహారాష్ట్రాదిభాషలవారు - హిందీవారి సంగతి సరేసరి - సంస్కృతమునందే కాదు, ఏ భాషలోనైనను మానవుఁడు తెలియఁదగిన యంశములున్నచో తమ తమ భాషలలోనికి తెచ్చుకొని అధ్యయనము చేయుచున్నారు. స్వభాషాగ్రంథములను అన్యభాషలలోనికి పరివర్తింపుచున్నారు. మన మేమి చేయుచున్నాము? ఇతరభాషల టుంచుఁడు. సంస్కృతములో నున్న సంపద నంతను తెనుఁగునకు తెచ్చుకొంటిమా? ఒకటియో అరయో తెచ్చుకొన్నను అవి ఎల్లరకును అందుబాటులో నేఁడు ఉన్నవా? లేవు. అభాష యీభాష అని కాదు, సర్వభాషలలోనికిని మన ఉత్తమగ్రంథములు పరివర్తింపఁబడవలెను. మనము ముందు, కనీసము, సంస్కృతభాషయందలి ముఖ్యములయిన అలంకారశాస్త్రగ్రంథముల నయినను తెనుఁగుచేసికొనవలయును. ఇదివఱకే సమర్థు లనువదించియున్న వానిని అందఱ యందుబాటులోనికిని తేవలయును.

ఇట్టిపనికి కేవలము పాండిత్యము ఒకచోట, కేవలము ఉత్సాహము మఱొకచోట, కేవలము ధనము ఇంకొకచోట నుండినందువలన ప్రయోజనము లేదు. ఉదారులు, సాహితీప్రియులు, ఉత్సాహవంతులు అయిన ధనికులు ముందునకు రావలయును. ఉత్సాహవంతులు పాండితీమండితులు, భాషాసాహితీవ్రతులు అయిన సమర్థు లగురచయితలు రచనకు పూనుకోవలయును. ఇటి వీరి పరస్పరసహకారముతో సువ్యవస్థాపితములయిన సక్రమసంస్థలద్వారమున ఇట్టి సత్కృషి జరుగవలయును. నాఁడు మన భాషాసాహిత్యములు లోటులేనివై కవులకు, రచయితలకు, సహృదయులకు, పఠితలకు సంతృప్తిసంతుష్టులు కలిగితీఱును.

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు ఈ యుద్యమమునకుతగిన సదభిప్రాయములుగల సంపన్నసహృదయులయియుండుట ఒక అపూర్వసన్నివేశము. వారు స్థాపించిన శ్రీ నరేంద్రనాథసాహిత్యమండలి చేసిన కవిపండితసత్కారములను, ప్రకటించిన సద్గ్రంథసందోహములను చేయఁదలఁచిన సత్కార్యకలాపమునుగుఱించి స్వాగతోపన్యాసములో శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారు వివరించియున్నారు.

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారిని చూడని, వారి మధురగంభీరవచోగుంభనముల వినఁగాడని ఆంధ్రుఁడు ఉండఁ డనుట వట్టి స్వభావోక్తి. తిరుపతి సంస్కృతపరిషత్ మున్నగు అఖిలభారతమహాసభలలో పాల్గొని ఆంధ్రులు గర్వింపఁదగిన అమరభాషామహోపన్యాసకుఁడుగా అభినవజగన్నాథపండితుఁడుగా శ్రీ కె. యం. మున్షి, డాకర్ రాజేంద్రప్రసాద్ మున్నగు మహామహుల సాశ్చర్యసబహుమానదృష్టుల నాకర్షించినవారు శ్రీ శర్మగారు. వారి ప్రక్రియలో అద్వితీయులుగా అడుగువెట్టినచోటున నెల్ల విజయపతాకము నెగురవేయుచున్నా రనుట మనకు గర్వకారణము. వారి యభిమానవిషయము సాహిత్యవిద్య. ఆ శాస్త్రగ్రంథముల నెన్నిటినో వారు బహువత్సరతపఃఫలమైన విశిష్టశైలిలో ఈవఱకే ఆంధ్రీకరించియున్నారు.

అమరవాణిలో ఔచితీమార్గప్రతిష్ఠాపకుఁడయిన క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చను వారు చక్కగా

అనువదించియున్నారు. దీని కివఱకే తెనుగున ప్రసిద్ధుల పరివర్తనసౌభాగ్యము పట్టినట్లు పండితులు ఎఱుగుదురు. కాని ఆ ప్రతులు నేఁడు అందుబాటులో లేవు.

ఈ శర్మగారి ఔచిత్యవిచారచర్చను శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు తమ సహృదయతకు, సాహితీప్రీతికి నిదర్శనముగా అంకితమంది దానిని వెలయించి ధన్యులు కానుండుట మిక్కిలి ఆనందదాయకము.

శ్రీ శర్మగారివంటి విద్వాంసులు - శ్రీ తిమ్మరాజుగారివంటి సహృదయ సాహితీప్రియసంపన్నులు - శ్రీ నరేంద్రనాథసాహిత్యమండలివంటి సంస్థలు - ఏతత్త్రయ సమ్మేళనము - సహృదయవాంఛితము.

ఈ సమయముకూడ విశిష్టమయినది.

పదవులవలన గొప్పవారయినవారు, గొప్పవారయినందున పదవుల నొప్పినవారు, గొప్పతనము ఉండియు పదవుల కాసపడనివారు, పదవులమించిన కవిపండిత హృదయములలో పదవులుగలవారు, కలవారనేకలు తమ జన్మదినోత్సవముల జరుపుకొనుచున్నారు. కాని ఆ జన్మదినోత్సవములకును నేఁటి శ్రీ తిమ్మరాజుగారి ఈ జన్మదినోత్సవమునకును చాల భేదముఉన్నది. పూలవాసన లున్నను సాహిత్యసౌరభములేని ఉత్సవము ఉత్సవమా ?

ఎందఱు పండితులు, ఎందఱు కవులు, ఎందఱు సహృదయులు, ఎందఱు మిత్రులు విచ్చేసియున్నారీ సభకు! ఔచిత్యవిచారచర్చవలన క్షేమేంద్రునకును, ఆ గ్రంథ గ్రంథకర్తలవలన శ్రీ మాధవరామశర్మగారికిని, ఈ త్రయమువలనను ఈ జన్మదినోత్సవమునకును, వీని వలన తణుకునకును, ఈ అన్నిటివలన తెనుఁగునకును అశేషశోభ చేకూరెన దనుటలో సందేహము లేదు.

వందలకొలది కవిపండిత సహృదయనాయకులు సందేశము లంపియున్నారు. పదులకొలది ఉపన్యాసకు లుపన్యసింపనున్నారు. ఇరువదులకొలది విచ్చేసిన కవి పండితసహృదయు లున్నారు. రాయలసీమనుండి మా అన్నగారు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యమహాకవి విచ్చేసి ఆధ్యక్ష్యము వహించి యున్నారు. ఇఁక దీనికి విజయమునకును వైభవమునకును ఏమి లోటు!

శ్రీ తిమ్మరాజ సహృదయులు తమకు, మఱి అరువదిమూఁడు జన్మదినోత్సవముల నైనను ఇట్టి శారదోత్సవములుగా జరుపుకొందు రనియు, ప్రతి ఉత్సవము నందును కనీసమొక్కొక్క సద్గ్రంథమునైనను తమ పేర వెలయింపజేసికొని సాహితీసేవ చేయుదు రనియు ఆశించుచు ఈ సభాప్రారంభోపన్యాసము ఇంత సుదీర్ఘ మయినందులకు మన్నింప వేడుచు అధ్యక్షనారాయణు లను కార్యక్రమము నడిపింపఁ గోరుచున్నాను.

"సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతామ్".

# అధ్యక్షోపన్యాసము

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు

ఇచ్చట చేరిన సభ్యులకు నమస్కారము.

ఈ ఊరి:తకుముందెన్నడో దరిసింపవలసియుండెను. మూడుసారులు పిలచిరి. కాని రాలేకపోయినాను. మాప్రాంతముల కీదేశము చాలదూరము. అందుచే సాధారణముగ నీప్రాంతముల కాహ్వానింపబడినపుడు ఏవో యనానుకూల్యములు చెప్పి తప్పించుకొనుచుండుట వాడుక. కాని యీసారి రాకతప్పలేదు. పండితులపైని శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారికి గల యాదరాభిమానము లంతటివి. వారినిగూర్చి నేనింతకుముందే పలుసారులు వినియుంటిని వారి రాజకీయ చతురత, వ్యాపారదక్షత, పాండిత్య పక్షపాతము, సౌజన్యము, ఆంధ్రదేశమున నానోట నీనోట పచ్చకప్పురపు తావువలె గుమ్మమనుచునేయున్నది. నాకునుగూడ వారిని సందర్శింపవలెనను నాసక్తి యుండెను. వచ్చి చూతునుగదా! వారి పండిత పక్షపాతమునకు నివ్వెఱపడినాను. వారెంత సులభులో యంత యుదారులు. ఎంత సరళస్వభావము గలవారలో యంతటి గంభీరులు శ్రీ హరిశ్చంద్ర ప్రసాదుగారన్ని విధముల తండ్రినిబోలిన వ్యక్తి ఆ యిర్వురిని దర్శించుట నా జీవితమున గొప్పవిశేష మనుకొందును.

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు చాల సంవత్సరములనుండి నాకత్యంతము సన్నిహితులు. ఇరుపక్షములయందును వారిది బ్రహ్మాండమైన పండితవంశము. అంతమాత్రమేకాదు. వారి పూర్వులలో గొప్ప తపస్వులున్నారు సన్యాసదీక్షవహించిన వారున్నారు. దిగ్దంతులవంటి పండితులయ్యు. వ్యవసాయము జేసికొని జీవించిన నిరీహులున్నారు శ్రీ మాధవరాయశర్మగూడ ఆ సంప్రదాయములను పోనీక, అంతయో యింతయో జీవితమున నిలిపికొన్న వ్యక్తి. విలక్షణమైన స్వరూపము. గంగాఝురివలె - నిరర్గళ ప్రవాహముగ దూకుచున్న వాగ్ధాటి; అతడు సభలలో నుపన్యసించునప్పుడు సరస్వతీదేవి మేఖలారవములు విన్పించుచుండును. దేశమున ననేకులు వక్తలున్నారు. కాని వారికి పాండిత్యబలము తక్కువ. శర్మగారు గురుకులవాస మొనర్చి చక్కగా చదువుకొన్న పండితుడు. శాస్త్రములయందు కృషిచేసి ఆ బలముతో సాహిత్యమునకు పదునుపెట్టికొన్న మనీషి. వ్యాకరణమును చక్కగ నధ్యయనమొనర్చిన పండితుడు. తర్కమును నేర్చికొన్న వాగ్మి. అలంకారశాస్త్రము నధ్యయనమొనర్చిన మనస్వి; వారి గురుపాదులు శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రులుగారు; వారిని నావంటివాడు పొగడుట అధికప్రసంగము. వారు పతంజలియొక్క యపరావతార మని దేశమునకే తెలియును. అట్టి గురువుకడ విద్యల నభ్యసించిన శర్మ - ఆ పాండితి నెంతయో చక్కగా నాకళించుకొనెను. శర్మగారి గృహిణి - అమె పోయి కొన్ని సంవత్సరములైనది; ఆమెయు చక్కని రచనము లొనర్చెడిది. ఈ యపూర్వదాంపత్యముతో నాగృహము కలకలలాడుచుండెను. అమె పోవుటతో శర్మ కీర్తిరథమున కేకచక్రమైనది పాపము! శర్మ యెంత పండితుడో అంత మంచివాఁడు; అతఁ డజాత శత్రువు అట్టి పండితు డౌచిత్యవిచారచర్చను దెనిగించుట దేశముయొక్క భాగ్యమనవలెను. కృతికర్త గొప్ప పండితుడు; కృతిభర్త గొప్ప యుదారుడు వీరిర్వురికిని "మణినావలయం" అన్న యౌచిత్యము దక్కినది. ఇక్కడ బ్రవేశించిన యనౌచిత్య మొక్కటే; నా యధ్యక్ష పీఠము దీనికి సహృదయులు మన్నింపవలెను.

క్షేమేంద్రుఁడు కాశ్మీరదేశమువాడు. అభినవగుప్తపాదుల శిష్యుడు. అంతేగాక నాత డనేక గురువులకడ విద్య నభ్యసించెను. శైవ వైష్ణవములను జీవితమున పండించుకొన్న సహృదయుడు. కొంత వైష్ణవపక్షపాతమే



అధ్యక్షోపన్యాసమిస్తున్న
శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు.
'సాహితీవల్లభ'
శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు.
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని

సమ్మానిస్తున్న

శ్రీ చిట్టూరి ఘువనెకరావుగారు.

యెక్కవనవచ్చును. బౌద్ధమునకుగూడ తన హృదయమున చోటు కల్పించుకొన్న సాహసి. వ్యాసునియం దపార భక్తిగలవాడు. దానికి సూచకముగ "వ్యాసదాసు" డైనవాడు. ఈతడు బహుముఖ ప్రజ్ఞాశాలి. అనేకవిషయములపై కావ్యములను వ్రాసినాడు. 'నీతిబోధ' మొదలుకొని "కామశాస్త్రము" వరకీతడు దడువని విషయము లేదు. హేళనకావ్యముల నల్లుటలో క్షేమేంద్రుఁ డద్వితీయుడు. సమకాలికములైన విషయముల నెన్నిటినో అత డాగ్రంథములయందు దడివినాడు. సంస్కృత చరమకాలమున హాస్యప్రధానముగ వ్రాయు మరియొక కవి యుద్భవించెను. అతడే నీలకంఠదీక్షితుడు. ఔచిత్యమున కొక స్వరూపము నిచ్చినవాడు క్షేమేంద్రుడే యని చెప్పవలెను. భరతుడు దానిని సూచించెను. భామహుడు, దండి, రుద్రటుడు మొదలైనవారు దాని నంతయో యింతయో చెప్పికొనుచునే వచ్చిరి; ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున ఔచిత్యమునకు ప్రత్యేకస్థానము గల్పించెను. రసమునకు ప్రాణముగ గుర్తించెను. కుంతకుడు వక్రోక్తిజీవితమున ననౌచిత్యమునకు రెండు లక్షణముల నొసగెను. మహిమభట్టు, మమ్మటుడు, భోజుడు మొదలగువా రందరు నౌచిత్యము నాదరించినవారే. జగన్నాథ పండితుడు అనౌచిత్యమునుగూర్చి వ్రాయుచు అది రసభంగహేతువగుటచే పరిహరణీయ మన్నాడు. పాశ్చాత్యులు సైతము ఔచిత్యముయొక్క గొప్పతనమును గుర్తించిరి. కావ్యజీవిత మేది యనువిషయమున బలుమతము లున్నవి. ఔచిత్యమును కావ్యజీవితముగ నిర్ణయించినవాడు క్షేమేంద్రుడే యనవచ్చును. ఇతడు సమకాలికకవుల నెందరినో తన గ్రంథమున నుదాహరించినాడు. అనుకూలప్రతికూలముగ వారిని విమర్శించెను. ఇది మహాసాహసమైన కార్యము. అంతమాత్రమే గాదు; గొప్ప యార్జవము కూడ. సమకాలికు లైన రచయితలపై నొక కవికి సానుభూతి యుండుట ఆత్మవంచనము చేసికొన కున్నచో అపూర్వమైన విషయము. ప్రత్యుదాహరణములుగ సమకాలికరచనల కొన్నిటి నీత డొసగినాఁడు. దానినిబట్టి రాగద్వేషముల నాతని కారోపించుట మన హృదయతత్త్వ మిట్టి దని తెల్పికొనుటయే. అతఁడు తన శ్లోకములలో గూడ నెన్నిటినో అనుకూలప్రతికూలముగా విమర్శించుకొనెను. అత డౌచిత్యము ఇరువదినాలుగు రీతు లని స్థూలముగ వింగడించినాఁడు. నామట్టుకు నాకు క్షేమేంద్రుడు చెప్పిన యనేకవిషయములతో సంవాదము లేదు. అతడు ప్రబంధార్థౌచిత్యమునకు ఈ క్రింది కాళిదాసుపద్య ముదాహరించినాడు.

> ఊరుమూలనఖమార్గ పంక్తిభిః
> తత్క్షణం హృతవిలోచనో హరః
> వాససః ప్రశిథిలస్య సంయమం
> కుర్వతీం ప్రియతమా మవారయత్.

భగవానుడైన జగద్గురువు నీ రీతి వర్ణించుటతో నౌచిత్యము చెడిన దని క్షేమేంద్రునివాదము. పార్వతీ పరమేశ్వరులవిషయమున నాత డొనర్చిన రతికేళివర్ణనమును మొత్తముగ గొంద రాలంకారికు లాక్షేపించినారు. వారందరు నీతివాదులు. వారివిషయమున నా యాక్షేపణ రాలేదు. క్షేమేంద్రునకు తక్కినకాళిదా సొనర్చినవర్ణన మంతయు నిష్టమే నన్నమాట! మరి యీ శ్లోకమునకు మాత్రము ఆ జగద్గురుని గొప్పదనమునకు గల్గినహాని యేమో నా కర్థము గాలేదు. అట్లే చంద్రకుని శ్లోకమునందును సమానబాహుళ్యముండవలె నని 'గుణౌచిత్యము'న నీత డాక్షేపించినాడు. అట్లే రాజశేఖరునిపద్యమును గూడ క్షేమేంద్రుడు తప్పుబట్టెను. రాజశేఖరుడు నాయికయొక్క హారములలోనిమణులు విరహాగ్నిలో పటపట మనుచు పేలాలవలె ప్రేలిపోవుచున్న వన్నాడు. భావ మెంతయో యుక్తముగ నున్నది. ఇక్కడ "తడత్కారిణో లాజస్ఫోట మనుస్ఫుటంతి మణయః" అనుబంధము నీత డాక్షేపించెను. ఆ మణులు ప్రేలుచున్న సన్నివేశములోని దారుణత్వమును చూపుటలో కఠినాక్షరములను వాడెనని సరిపెట్టుకొనవచ్చును. రాజశేఖరునిహృదయముకూడ నంతే. తన విమర్శనమును క్షేమేంద్రు డొక యుపమానముతో సమర్థింపఁజూచికొన్నాడు ఆ యుపమానముగూడ చక్కగ లేదు. ఇట్లనేకవిషయములలో క్షేమేంద్రునకు నాకును పొత్తుకుదరదు. కాని యంతమాత్రముతో నా మహామనీషియొక్క గొప్పతనము నాశంకించునంతటి దౌర్బల్యము నాకులేదు. అత డొక మేరువు.

నా యీ పలికిన నాలుగుమాటలతో నేమేని యౌచిత్యము చెడకుండినచో సంతోషము; సెలవు.

# అభినందన జ్యోత్స్న

శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య

శ్రీకర ముళ్ళపూడి కులశేఖర తిమ్మధరావరా సదా
నీకును నీ గృహస్థులకు నీ హితకోటికి నీ నుడుల్ కనుల్
సోఁకినచోటికిన్ ముదము శోభ శతాయు వఖండ సౌఖ్యముల్
సేకుఱుఁగాక మాధవుని క్షేమ శుభంకరమైన సత్కృతిన్.

కృతివగుదయ్య నీవు పరికింపఁగ తిమ్మనరేశ్వరా రస
ప్లుతియగు నౌచితీ కృతికి బుద్ధిని గొంటివి సిద్ధిఁగంటి సా
హితి కవధిధ్వజమ్మయిన యీతఁడు మాధవరాయశర్మ నీ
కతులిత సాహితీమణి మహసమిచ్చుట యింత సాటదే

క్షేమేంద్రుండు కళాప్రపంచమునకున్ క్షేమంకరుండై మనీ
షా మంథాద్రి మథించి మున్ను సురభాషావార్ధిఁ గొన్నట్టి ని
ద్దా ముద్దై తగు వెన్నముద్ద నిటఁ డాంధ్రమ్మున్న క్రొంజక్కెరన్
శ్రీమత్తిమ్మపరీవృఢా పొదిగి యిచ్చెన్ నీకు క్షేమమ్ముగన్.

తిమ్మాత్మ్యేఖర యెంత నీకెసఁగుఁ బృథ్వీరాజ్య మీసాహితీ
సమ్రాణ్మౌళికి నంతకంతయి సహస్రాధిక్యమై సత్కళా
సామ్రాజ్యమ్ము పొసంగుఁ దాద్భుతుఁడు నిన్ జామాతగాఁ గోరి తా
నస్రముండై జయ పెట్టి నీ కొలువునన్ సామంతుఁ డౌ టల్పమే?

సత్యముగా ఫలించినది జన్మదినోత్సవ మియ్య దయ్య యౌ
చిత్య విచారచర్చ యిది సేకొనఁగల్గుట స్వాతికార్తెలోఁ
బ్రత్యహ మెన్నిరాల విలపై నొక ముత్తెపుఁజిప్పతోడి సాం
గత్యము గన్న చిన్కొకటి గాదె ఫలించెడి ముత్తియంబుగన్.

దర్శనాచార్యుండు దర్శింపఁగోరిన సాహితీమండలీ స్థాపనమ్ము
సాహిత్యసమ్రాట్టు జయపెటఁదగినట్టి భాషామతల్లికా పోషణమ్ము
విద్యాప్రవీణుండు విస్తుపోఁచగియెడి శిష్టప్రజానీక సేవనమ్ము
శ్రీ మహోపాధ్యాయుఁ డామతింపఁగఁ దగ్గ కవిపండితార్చనా కౌతుకమ్ము
తణుకుపురిలోన తిమ్మరాడ్ధారుణీశ నీకతమ్మున వేరూని నిల్చి నేఁడు
నెగడి పూచి ఫలించెడి నీదు జన్మదినమహోత్సవ కృతిసమర్పణము పేర.

హృదయము శాంతింపఁగ నీ
వెది కొడుకు నరేంద్రనాథు స్మృత్యంకముగాఁ
బదిలించితి వా మండలి
కిది తగు నాతండు గనెడిః నెడఁదఁ బ్రశాంతిన్.

పదపద స్వాదు సంపదలున్న మంజూష
జీవమూఁదిన కళా శిల్పఖండ
మమర వాణీదేవి యంతరంగ రహస్య
మానందకళలూరు తేనెవాఁక
లలిత నిర్మల గుణాలంకార నికషిక
రసమయ ధ్వనుల నిర్మాణయంత్ర
మాకార చేష్టాదు లరసి చూపెడి యద్ద
మెంతవారికి వంకలెన్ను సొబగు

హాయిగూర్చెడి మాధవరాయశర్మ
తీయని యమోఘమగు సాహితీ తపస్సు
ఉడుగరగ నీదు జన్మదినోత్సవమున
కమరెఁ దిమ్రాజ దీర్ఘాయువై సుఖింపు.

తన యౌచిత్య విచారచర్చ యను
శాస్త్ర శ్రీమణిన్ సత్కళా
ఖనియౌ మాధవరాయశర్మ కడు
వేడ్కం జెక్కె నీ నామకాం
చనరేఖన్ దన యౌచితిన్ నిలిపెఁ
దచ్చాతుర్య సుశ్రీకి మే
మును గొండాడుచు నిల్చుకొంటి మిటు
మిమ్మున్ 'సాహితీవల్లభా.'

# అలంకార ప్రస్థానము ఔచిత్య విచారచర్చ

శ్రీ పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రి

సాహిత్య మనునది ఉత్తమ మయిన కళ. దాని నాస్వాదించుటకు ప్రాజ్ఞులు, క్రాంతదర్శులును, ఋషి కల్పులు నగు పండితులు తమతమ బుద్ధి విభవముల ననుసరించి పలుత్రోవలు త్రొక్కియున్నారు. అందు వలన సాహిత్యదర్శనము అను నొక శాస్త్రము ఏర్పడినది. అట్టి శాస్త్రమును విహంగమదృష్టితో నాలోకింతము.

భరతముని రచించిన నాట్యశాస్త్రము మొదటి లక్షణమును దెల్పు గ్రంథము. అయ్యది కాళిదాసుచేత పరామర్శింపబడుటవలన అతనికి పూర్వమే యున్నదని చెప్పవలయును. భరతముని కాలమునుండి జగన్నాథ పండితరాయని కాలమువఱకును ఆలంకారికులు కావ్యమునకు ఆత్మ యెద్ది అను విషయములో పలురీతులు ఉట్టంకించిరి.

వేదములోకూడ ఉపమాద్యలంకారములు కనబడుచున్నవి. కాని, సంహితా బ్రాహ్మణోపనిషత్తుల యందు ప్రత్యేకముగా అలంకారశాస్త్ర మున్నటుల కానరాదు. యాస్కుడు రచించిన నిరుక్తశాస్త్రములోను 'న' 'ఇవ' మొదలయిన అవ్యయములు సాదృశ్యమును జెప్పెడి శబ్దములుగా నిరూపింపఁబడినవి అగ్నిపురాణములో గూడ కావ్యలక్షణము, అలంకారములు మొదలయినవి చెప్పఁబడినవి. పతంజలి విరచితమయిన మహాభాష్యములో కొన్ని దృశ్యకావ్యములు, కొన్ని శ్రావ్యములు పేర్కొనబడినవి.

రాజశేఖరుఁడు రచించిన 'కావ్యమీమాంస' అనెడి గ్రంథములో సాహిత్యదర్శనము సరస్వతీపుత్రుని వలన జన్మించినదనియు. అతడు ఇంద్రుఁడు మొదలగు శిష్యులకు ఉపదేశించె ననియు చెప్పబడినది.

భరతుఁడు తన నాట్యశాస్త్రములో 'న హి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే' అనఁగా 'రసములేనిదే కావ్యములోని విషయ ముండరాదు.' అని చెప్పుటచే రసమే కావ్యమునకు ఆత్మ - ప్రధానము అని అతని అభిప్రాయమని విదితము.

'రస్యతే ఆస్వాద్యతే సామాజికైః ఇతిరసః' 'సామాజికులచే ఆస్వాదింపబడునది రసము' అని అర్థము. ఆ రసము బ్రహ్మానంద సబ్రహ్మచారి. అనగా బ్రహ్మానంద తుల్యము. లేక బ్రహ్మానందమే అనియు తెల్పిరి. 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' 'విభావానుభావ వ్యభిచారి సంయోగమువలన రసనిష్పత్తి యగును' ఇదియును భరతోక్త సూత్రమే. ఇందలి 'సంయోగ' శబ్దమునకు అర్థమును వేర్వేరుగా నాలంకారికులుచెప్పిరి. భట్టలోల్లటాదులు జన్యజనకభావ సంబంధమును. భట్టనాయకుడు భోజ్యభోక్తృ భావమును, శంకుకుడు అనుమాప్య - అనుమాపక భావమును. శ్రీమదభినవ గుప్తాదులు వ్యంగ్య వ్యంజక భావమును - ఆ సంబంధముగా వర్ణించిరి.

లఘువృత్తికారుఁడయిన ప్రతీహారేందురాజు రసమే కావ్యాత్మ యని స్పష్టముగా చెప్పెను.

'రసాద్యధిష్ఠితం కావ్యం
జీవద్రూపతయా యుతః
కథ్యతే తద్రసాదీనాం
కావ్యాత్మత్వం వ్యవస్థితమ్'

'రసముగల కావ్యమే జీవించిన రూపముగలది. కావున రసమే కావ్య జీవితము'



అభినందిస్తున్న
శ్రీ పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రిగారు,
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు.
'సాహితీవల్లభ'
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ చిట్టూరి కృష్ణారావుగారు.

## అలంకార ప్రస్థానము, ఔచిత్యవిచారచర్చ

భామహుడు 'కావ్యాలంకార' మను గ్రంథములో అలంకారమే కావ్యాత్మయని స్పష్టముచేసెను.

'సైషా సర్వైవ వక్రోక్తిః
అనయాఽర్థో విభావ్యతే
యత్నోస్యాం కవినా కార్యః
కోఽలంకారోఽనయా వినా,'

'వక్రోక్తి అనఁగా అతిశయోక్తి. దీనిచేతనే సహృదయుల హృదయములందు కావ్యార్థము భావింపఁబడును. కావున కవి యనఁబడువాఁడు తన గ్రంథములో అతిశయోక్తికై ప్రయత్నింపవలయును. అది లేనిదే అలంకారము లేదు'.

దండి 'కావ్యాదర్శము'లో 'శ్లేష' మొదలయిన పది గుణములు కావ్యజీవితమని చెప్పెను.

వామనుడు 'కావ్యాలంకార సూత్రము' అనెడి గ్రంథములో కావ్యమునకు రీతియే ఆత్మ యనియు, అది స్త్రీకి యౌవనము వంటిదనియు అలంకారములు ఆరూపమునకు అతిశయాధాయకములనియు చెప్పెను.

'యువతే రివ రూప మంగ! కావ్యం
స్వదతే శుద్ధగుణం తద ప్యతీవ
విహితప్రణయం నిరంతరాభి
స్సదలంకార వికల్ప కల్పనాభిః.'

ధ్వని సంప్రదాయ ప్రవర్తకుఁడగు ఆనందవర్ధనాచార్యుఁడు 'ధ్వన్యాలోకము' నందు ధ్వనియే కావ్యాత్మ యని నిరూపించెను.

తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యే
సౌభాగ్యమేవ గుణసంపది వల్లభస్య
లావణ్యమేవ వపుషి స్వదతేంఽగనాయాః
శృంగార ఏవ హృది మానవతో జనస్య'.

'వాక్యమునందు తాత్పర్యము. కావ్యమునందు ధ్వని ప్రధానము' అని చెప్పెను.

కుంతకుడు వక్రోక్తియే కావ్యజీవితమని 'వక్రోక్తి రేవ వైదగ్ధ్య భంగీభణితిః' అని చెప్పుటచేత స్పష్టమగుచున్నది.

11వ శతాబ్దమున క్షేమేంద్రుడు 'ఔచిత్యవిచార చర్చ' అనెడి గ్రంథమును రచించెను. ఇతఁడు అభినవగుప్తుని శిష్యుఁడు. కాశ్మీర రాజయిన జయాపీడుని మంత్రి యగు నరేంద్రుని నప్త. ప్రకాశేంద్రుని కుమారుఁడు. ఇతఁడు శైవమతస్థుఁడైనను సోమపాదుఁడనెడు గురుని ప్రభావమువలన వైష్ణవమతము సంగ్రహించెను. ఇతఁడు బహుముఖ ప్రజ్ఞాశాలి. కవికంఠాభరణము, కవికర్ణిక- ఇత్యాదులను పలుగ్రంథములను రచించెను.

ఔచిత్యమే కావ్యజీవితము అని ఇతనిసిద్ధాంతము.

'ఉచితం ప్రాహు రాచార్యాః
సదృశం కిల యస్య యత్
ఉచితస్య హి యో భావః
తదౌచిత్యం ప్రచక్షతే'

శబ్దార్థములు కావ్యమనంబరగును. శబ్దార్థముల బంధము ఉచితముగా నున్నచో క్షేమేంద్రునియొక్క వివక్షితమయిన ఔచిత్యము ఏర్పడును.

ఆనంద వర్ధనాచార్యుడు ధ్వన్యాలోకమునందు సూచించిన ఔచిత్యమును

'అనౌచిత్యాదృతే నాన్య
ద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్యబంధస్తు
రసస్యోపనిష త్పరా'

క్షేమేంద్రుడు కావ్యజీవితమని నిరూపించెను.

అది వర్ణ పద వాక్య విభక్తులనుబట్టి పలువిధములుగా వర్ణింపబడినది అనౌచిత్యమునుగూడ సోదాహరణముగా నిరూపించెను. దీనికి తన గ్రంథమునందలి శ్లోకములనే యుదాహరించి సత్యవాదిత్వమును నిరూపించెను.

ఇట్టి ఔచిత్యవిచారచర్చనేకాక సంస్కృతభాషలోని పెక్కు అలంకార శాస్త్ర గ్రంథములను మాతృభాషలోనికి అనువాదమొనర్చి తెలుగుభాషకు వెలుగు దెచ్చిన పండితాగ్రణీ! శ్రీ మాధవాచార్య - అపరావతారా! జోహారులు.

స్వర్గతుడైన నరేంద్రునకు స్మారకము గాను, సాహితీపోషణమునకును అక్షరమైన శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలిని స్థాపించి

'ధరణిఁ బొగడిత యెందాకఁ బరగు నంత
కాలమును బుణ్యలోకంబు గల్గునండ్రు'

అను భారత వచనమునుబట్టి నరేంద్రుని యశశ్శరీరమును దివ్యత్వ మొందించుటయేకాక, పెక్కండ్రు కవి పండితులచేత సాహిత్యక, చారిత్రక గ్రంథములు వ్రాయించియు, పండితులను సన్మానించియు తద్వారా భాషాసేవ యొనర్చెడి కాకతీయ యశోభూషణా! శ్రీ ముళ్లపూడి వంశాబ్ధిరాకా చంద్రా! తిమ్మరాజ నరేంద్రా! జోహారులు.

తణుకు నగరంబును పారిశ్రామిక, వైజ్ఞానిక నగరంబొనర్చియు, శాసనసభా సభ్యుఁడవై ప్రజాసేవ యొనర్చియు, మీ తండ్రిగారితోపాటు సాహితీ సమారాధన తత్పరుఁడవైన శ్రీ హరిశ్చంద్రప్రసాద్ మహాశయా! మీకు జోహారులు!

'ఆదిరాజ యశోబింబం
అదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషా మసన్నిధానేఽ పి
న స్వయం పశ్యనశ్యతి' అనెడి అభియుక్తోక్తి ననుసరించి మీ యశశ్చంద్రికలు అచంద్రార్కము దశదిశల వెలయుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

క్రమరాజకులోత్పన్నః
తిమ్మరాజ సమాహ్వయః
విద్యాకులపతి శ్చాసౌ
జీయాచ్చ శరదాం శతమ్.

# ప్రశంస

రాయలతోడనే తెలుఁగురాజ్యము పోయెను, వానితోడనే
పోయిరి సత్కవీశు లనుమూర్ఖుల మాటలు పొల్లుచేసి మా
రాయఁ తిమ్మరాజు కవిరాజుల స్నేహము చేసిచేసి ఆ
ప్యాయత సాహితీవిభుత నందెను సుందరకావ్యభర్తయై.

— శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు

# మా మైత్రి

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ

శ్రీ తిమ్మరాజుగారితో నా స్నేహసంబంధము మూడు దశాబ్దాల వయస్సుగలది. వారి ఈ అరవై మూడో జన్మదినోత్సవం మా మైత్రికి రజతోత్సవంగా భావిస్తున్నాను.

ఈ ముప్పది సంవత్సరాల దీర్ఘకాలంలోను నేను శ్రీ తిమ్మరాజుగారిని అనేక కోణాలనుంచి చూచి అర్థం చేసికొన్న చిరకాలానుభవంతో వారినిగూర్చి చెప్పాలంటే ఈ ఉపన్యాస వేదికమీద నాకిచ్చిన స్వల్పకాలం ఎంత మాత్రం చాలదు. సంగ్రహంగా వారి సహజ లక్షణాలను ఎత్తి చూపుతూ వారిని గూర్చిన నా అనుభవసారం మాత్రం మూడు మాటల్లో వెల్లడిస్తాను. స్వార్థం లేని దృష్టికి సహజ లక్షణాలే కన్పిస్తాయి. నిస్వార్థదృష్టిలో నేను చూచినదే చెప్తాను.

శ్రీ తిమ్మరాజుగారు శత్రువులకుకూడా అపకారం తలపెట్టకుండా అందఱి అభివృద్ధినీ ఆకాంక్షించే పవిత్ర హృదయులు. ఈ విషయంలో వారి హృదయశుద్ధి సాటి లేనిది. వారు అందఱినీ నిండుహృదయంతో ప్రేమిస్తారు. అందఱూ తన్నుకూడా అల్లాగే ప్రేమించాలని ఆరాట పడతారు. తనకంటె ఎంత తక్కువస్థాయివాడైనా తన మిత్రుడు తన్ను ప్రేమించడంలేదని తెలిసిననాడు వారు మహాబాధపడతారు. ఎంతటి ప్రబలశత్రువునైనా మిత్రునిగా మార్చుకోవడానికి వారు శత్రుపక్షంలోని రాక్షస మంత్రిని నమ్మిన మిత్రునిగా వశంచేసికోవడానికి చాణక్యుడు చేసినంత మహత్తరకృషి చేస్తారు. ఎవరికైనా వారిమీద శత్రుభావం ఉంటే ఉండొచ్చు కాని వారికి మాత్రం ఎవ్వరిమీదా కించిత్తు శత్రుభావం లేదు. అజాత శత్రుడన్న మాట సరిగ్గా ఆయనకు తగ్గ బిరుదు మాట. అజాతశత్రుత్వం వారి మొదటి సహజలక్షణం.

తన మిత్రులలోని లోపాలను నొచ్చకుండా అన్యాపదేశంగా తెలుపుతూ వారిని లోపరహితుల్ని చెయ్యాలని వారు తాపత్రయపడుతూ నిండుగా ప్రేమించడం వారిలోని రెండవ సహజలక్షణం. ఈ సందర్భంలో వారు మిత్రులతో మాట్లాడుతూన్నప్పుడు వారి సంభాషణ బహు చమత్కారంగా ఉంటుంది. పదిమంది ఉన్నప్పుడు వారు ఎవరినుద్దేశించి లోపాలను ప్రకటిస్తున్నారో తెలిసికోలేము. ఎవరితెన్ను వారే తన్నుగూర్చే చెప్తున్నారేమో అని భుజాలు తడుముకుంటూంటారు. నా లోపాలను సరిజేసి నన్ను పరిపూర్ణుని చెయ్యాలని వారు యత్నించేవారు. నాలో అలసత్వం పోవాలని వారు ముఖ్యంగా కాంక్షించేవారు. ఒక్కసారి నేను తిరుపతి సంస్కృత విశ్వపరిషత్తుకి వెళ్ళివస్తూ శ్రీ కాళహస్తి దేవాలయంలో ప్రదక్షిణం చేస్తూ చుట్టూవున్న దేవతావిగ్రహాలను చూస్తున్నాను. అచ్చట ఒకవిగ్రహం ఉంది. దాని పేరు గుర్తులేదు. దానివద్ద ఒక రాగిడబ్బువేసి కావలసిన కోరిక తలచుకుంటే కోరిక ఫలిస్తుందిట. అంతా డబ్బులు వేస్తున్నారు, నేనుకూడావేసి ఏదోకోరిక తలుస్తూ నిల్చున్నాను. నావెనుకనుండి నాపైనుండి చేయెత్తి ఎవరో ఒక రాగిడబ్బు విగ్రహంముందు వేసి "మామేష్టారికి బద్ధకం పోవాలి," మామేష్టారికి బద్ధకం పోవాలి, మా మేష్టారికి బద్ధకం పోవాలి' అని ముమ్మారు పైకి ఉచ్చరించారు. వెనక్కి తిరిగి చూస్తునుగదా పకపకా నవ్వుతూన్న శ్రీ తిమ్మరాజుగారు ప్రత్యక్షమైనారు. ఎప్పుడువచ్చారో తెలియక ఆశ్చర్యపడ్డాను. వారికి నా అభివృద్ధిమీద ఉన్న పవిత్రప్రేమలక్షణానికి ముగ్ధుడనైనాను. అందఱి విషయములోను వారు అల్లాగే వుంటారు. నాలో లౌక్యం తక్కువని, ఆవేశం ఎక్కువని, హృదయంతోకాక బుద్ధితో పనులు చక్కబెట్టుకోవాలని వారు పదేపదే చెప్పేవారు. కాని నాలోపాల్ని నేను ఎన్నాళ్ళకూ సర్దుకోలేకపోయాను. నేనూ వారి లోపాలను తొలగించి వారిని పరిపూర్ణుల్ని చెయ్యడానికి ఉపదేశం చెయ్యాలని అనుకొనేవాణ్ణి. అంతటిధైర్యం నాకు వారిసమక్షంలో ఉండేదికాదు.

ఉండబట్టలేక నా ఉపదేశాల్ని అన్యాపదేశంగా వారి కత్యంత ప్రీతిపాత్రుడైన కీ॥ శే॥ నరేంద్రుని చరిత్రలో బంధించాను. 'నరేంద్రుడు' కావ్యం రచించడానికి అదొక ముఖ్యకారణంకూడ. నా ఉపదేశాలు వారికంది నట్లు నాకు తోచదు. ఏది ఏమైనా ఒకరినొకరు లోప రహితుల్నిగా చెయ్యలేకపోయినా ఒకరివల్ల మఱియొకరికి ఏదో కొంత మంచి సంక్రమించియే తీరుందని చెప్పకుండ ఉండలేను.

వారు అమృత హృదయముతో నిండుగా ప్రేమి స్తారు. పవిత్ర హృదయంతో శుభాకాంక్ష లందిస్తారు. వారి శుభాకాంక్షలే నా అభివృద్ధికి కారణాలుగా నేను నిజంగా భావిస్తాను. నేను వారినుండి కోరింది పొందిందీ ఆ శుభాకాంక్షలే. మన అభివృద్ధి నిండు హృదయంతో అకాంక్షించే పవిత్ర హృదయులుండడమే భగవదను గ్రహంఉండడమంటే అనీ, అన్నిభాగ్యాలకూ ఆదే మూల కందం అనీ, నాకు తెలిసిన అనుభవ రహస్యం కావడం వల్ల అర్థచింతతో ముడిపడకుండా వారి పవిత్రహృదయం నాపైనుండి ఏపరిస్థితిలోను తొలగిపోకుండా నేను కాపాడు కుంటూ ఉన్నాను. అల్లాగని వారిహృదయంలో స్థానం సంపాదించుకోవడముకోసం నేను వారిభావాలికి ఎప్పుడూ అమ్ముడుపోలేదు భావదాస్యానికి లోనైన కవి లోకానికి తేలికైపోతాడు. కాన నాభావాల్ని నేను నిలుపుకుంటూనే వారి ననుసరించి యుంటున్నాను. వారి కోరికమేరకు నేను కావ్యాలు వ్రాశాను. కాని నాకుదొరికిన ఆధారా లతో లోకానికి నా కావ్యాలలో సత్యాన్ని చూపడానికే యత్నించాను. ఏ సందర్భంలోను భావ పవిత్రతనుండి దిగజారిపోలేదని త్రికరణశుద్ధిగా చెప్తూవున్నాను.

ఇక 'అత్యాసన్నం పరిత్యజ్యమునేర్దత్తం తునిష్ఫలం' అన్నది వారిలో స్థావరమేర్పరచుకొన్న మూడవ స్వాభా విక లక్షణం. 'తనవాడు, తనవాడు' అని తన మితుల యొక్క, గ్రామస్థులయొక్క, పరిసర ప్రజలయొక్క, జాతియొక్క, దేశీయులయొక్క అభివృద్ధికి వారు నిరం తరం దోహదం చేస్తూంటారు. ఇంటిలోనుండి ప్రారం భించి విశ్వాంతరాళంలోకి అభివృద్ధిని సాధించాలన్నది వారేర్పఱచుకొన్న సోపానమార్గం. తన కుటుంబచరిత్ర తెలిసికోకుండా దేశచరిత్రలు పరిశోధన చేయడం వారికి కిట్టదు. దేశచరిత్రయందు వారికున్న సరదా ఎవ్వరికీ లేదు దేశంలోని అన్ని చారిత్రక సంస్థలలోను వారు జీవితసభ్యులుగా ప్రముఖస్థానంలోనున్నారు. తనవాడు అర్హుడుండగా అన్యుణ్ణితీసికొనివచ్చికనకాభిషేకంచెయ్యడం అయనకు నచ్చదు. తనవాళ్ళలో లోపాలుంటే వానిని తొలగించాలేకాని అన్యుల్నితెచ్చి గౌరవించి తనవాళ్ళని కించపరచేపని దేశానికే అభివృద్ధి నిరోధకంగా వారు భావిస్తారు 'ఇంటగెలచి రచ్చ గెలువవలె'నన్నది వారికి వంటబట్టిన గుణం. ఈపద్ధతి సిద్ధాంతరీత్యా వాదనకోసం కొందఱికి నచ్చకపోయినా నిజంగా అందరిలోను జరిగేది మాత్రం అంతే. స్వజనప్రేమ, స్వజాతిప్రేమ లేనిదే స్వదేశప్రేమ, ప్రపంచప్రేమ దానంతటది పుట్టుకరాదు. చిన్నవాడుగా పుట్టి అభివృద్ధి సాధించుకుంటూ పెద్దవాడు కావడం సృష్టిలో సహజలక్షణం కాని అమాంతంగా పెద్దవాడుగానే ఊడిపడ్డం ఎక్కడా జరిగేదికాదు. పర ద్వేషం లేకపోవడమే కావాలి కాని స్వజన ప్రేమలో దోషం ఏమీలేదు. ముందుగానే విశ్వమానవ సౌభ్రా తృత్వంతో ప్రేమ ప్రారంభం చేయడం పల్లానికి ప్రవ హించే స్వభావంగల నీటిప్రవాహాన్ని కొండ శిఖరం ఎక్కించడానికి చేసే ప్రయత్నంవలె నిష్ఫలంకాకతప్పదు.

పరద్వేషం శ్రీ తిమ్మరాజుగారిలో కంచుకాగడా వేసి చూసినా కనపడదు. 'ద్వేషమున ద్వేషమెపుడు శాంతింపఁబోదు. ద్వేషమనురాగముననె శాంతింపవలయు కనుక నీజీవితానిత్యతను గ్రహించి ఆర్పవలె ద్వేషవహ్ని ప్రేమామృతమున' అన్న నా బుద్ధగీతిలోని పద్యాన్ని వారు పదేపదే ఉదహరిస్తూంటారు. ద్వేషం వారిలోనే కాదు వారి కుటుంబచరిత్రలోనే లేదు.

'నావాడు' అనే మాటను తన మిత్రుడనీ, మిత్రుల తాలూకనీ, గ్రామస్థుడనీ, పరిసర గ్రామమువాడనీ, జాతి వాడనీ ఈవిధంగా క్రమపరిణామమై విశాలమైన అర్థంలో వారు ఉపయోగిస్తారు. కేవల జాతిపరమైన సంకుచిత తత్త్వంగా దాన్ని అర్థంచేసికోవడం దృష్టిదోషం, అర్థం చేసికొనేవారి సంకుచిత తత్త్వం. ఎంత తనవాడు అను కొన్నా వాడు తగినవాడైనప్పుడే (అర్హ లక్షణములు కలిగి

యున్నప్పుడే) వానిని వారు ప్రేమిస్తారు కాని తన జాతీయుడని అనర్హుణ్ణి నెత్తిమీద కెక్కించుకోవడంగాని, అర్హుడైన పైవాణ్ణి చిన్నచూపు చూడడంగాని వారిలోలేదు. పరద్వేషం లేదనడానికి ఇదే తార్కాణం. పరద్వేషం అహంకారంవల్ల పుట్టుతుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే శ్రీ తిమ్మరాజుగారిలో అహంకారం లొచ్చు, మమకారం హెచ్చు అనిచెప్పొచ్చు. ఇది వీరిలోనేకాదు ముళ్ళపూడివారిలోనే సహజ లక్షణం.

దీనికి వ్యతిరేకంగా మమకారంలేని అహంకారం కొందఱిలో కన్పడుతుంది. అదీ ప్రమాదం. అహంకారం గలవారితో సంబంధం పెట్టుకొన్నవారెవరూ బాగుపడరు. మమకారం గలవారితో సంబంధం పెట్టుకొన్నవారెవరూ చెడిపోరు. ఇది నగ్నసత్యం.

నా ఆర్యచాణక్యుడు, బుద్ధగీత, రైతురాయడు రెండవ ముద్రణాన్ని చూడగలిగేయి. త్వరలో నరేంద్రుడు, రంగరాయ చరిత్ర, రెండవముద్రణం పొందుతున్నాయి. కాకతి ప్రోలరాజు మొన్ననే ముద్రింపబడింది. ఇంకా అది ఆవిష్కరణ మహోత్సవం జరుపుకోవలసివుంది. ఇవన్నీ వారు కోరి వ్రాయించుకొన్నవే. నేనై వ్రాసిన లక్ష్మీ సహస్రకావ్యము (శ్రీ వేంకటాధ్వరి సంస్కృత గ్రంథమునకు తెలుగు) త్వరలోనే ముద్రిస్తామని శ్రీ తిమ్మరాజుగారు ఇటీవలనే వాగ్దానం చేశారు.

ఆ శుభసమయానికే ఎదురుచూస్తూన్నాను. నన్ను గూర్చి నా గ్రంథాలనుగూర్చి ఎవరైనా ప్రశంసిస్తూన్నప్పుడు తాము చాటుననుండి వినాలని వారు అభిలషించేవారు. నా రచనలు నిజమైన ప్రశస్తిని పొందగలిగిందీ, లేనిదీ తెలిసికోవాలని వారి తహతహ. ఆకోరిక వారను కొన్న విధంగా ఎన్నిసారులో తీరినట్లు, సుప్రసిద్ధ రచయితలు నా వ్యాసాల్ని మెచ్చుకొన్నట్లు వారు వెల్లడించినపుడు నా హృదయం అవధిలేని సంతృప్తి నందగలిగింది. 'అనృణోఒహం' అనుకొన్నాను.

శ్రీ తిమ్మరాజుగారితో నా పరిచయం 'ముద్రా రాక్షసం, కౌటలీయార్థశాస్త్రం' అనే సంస్కృత పుస్తకాల్ని వారికి చదివి వినిపించడంతో ప్రారంభమై నరేంద్ర కావ్య రచనతో విడివడరాని సంబంధం ఏర్పరచుకొంది. నరేంద్రుడు నిజంగా నరేంద్రుడే. అతని మరణ దుఃఖాబ్ధిలో మునిగిపోకుండా శ్రీ తిమ్మరాజుగారిని నా నరేంద్రకావ్యం తేల్చగలిగింది. ఆపైని నరేంద్రుని పేరుతో సాహిత్య మండలి స్థాపింపజేసి అతనిని అమరజీవిని చెయ్యడంలో నిమగ్నపఱచి వారిని దుఃఖనిమగ్నులు కాకుండాచేశాను. క్రమంగా వారిని సాహితీపరం చెయ్యగలిగేను, ఇది నా ముప్పదియేండ్ల వ్యవసాయానికి కలిగిన మేలిపంట. ఇది నాకు నాజీవితంలో గొప్పగా సంతృప్తినిచ్చేవిషయం. ఈ విధంగా మేమిరువురం నరేంద్రుని ఆత్మలో సూత్రితులం కావడంవల్ల మామైత్రి జీవితాంతమూ అచ్ఛేద్యం, అభేద్యం అక్షరపాశ బంధిత మవడంచేత అజరామరంకూడా. మా ఈ పవిత్రమైత్రి స్వర్ణోత్సవం జరుపుకోవాలని పరమేశ్వరుణ్ణి కోరుకుంటున్నాను.

ఈ జన్మదినోత్సవ శుభసమయంలో శ్రీ తిమ్మరాజుగారికి నచ్చిన బహుమతి ఏదిఇస్తే బాగుంటుందని యోచించాను. వారికి మహాప్రేమపాత్రుడైన శ్రీ నరేంద్రుని గుణకథనంకంటె ప్రీతికలిగించేది ఏముంది. ఇరవై ఏండ్లతర్వాత నాకు లభించిన శ్రీ నరేంద్రుని విద్యార్థి జీవితంలో మకుటాయమానమైన ఒక గుణవిశేషాన్ని పద్యాలలో పొదిగి 'నరేంద్ర హృదయం' అన్న పేరు గల ఖండకావ్యాన్ని వారికి బహూకృతిగా సమర్పించుకొంటున్నాను.

# వర్ధాపనోత్సవము

శ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రి

లోకమున ప్రతిజీవియు చిరకాలము భోగభాగ్య కీర్తులతో సుఖముగా జీవింపవలయునని కోరుచుండును. అదిసహజము, ఎవనిజీవితము పరోపకారము కొఱకు అంకితముచేయబడునో వాడే ధన్యజీవి. అట్టి జీవితము లోకమున నేకొద్దిమందికోగాని యందఱకును లభింపదు. అట్లులభించిన జీవితమును మంచిపనులచేతను, సౌజన్య సౌశీల్యాది గుణములచేతను వృద్ధినొందించుకొనువాడు కడునేర్పరి.

"అక్రోధన స్సత్యవాదీ భూతానా మవిహింసకః అనసూయు రజిహ్మశ్చ శతంవర్షాణిజీవతి" కోపములేని వాడును, సత్యమును బలుకువాడును, ఏభూతమును హింసింపనివాడును, అసూయలేనివాడును, కాపట్యము లేనివాడును, నూరు సంవత్సరములు జీవించునని మహర్షులవాక్యము. ఇట్లే మంచిపనులుకూడ నాయుర్వృద్ధికి హేతువు. ఆ సత్కర్మలలో వర్ధాపనమను సత్కర్మకూడ నొకటి. వర్ధాపనమన తానుబుట్టిన రోజున దేవతలను, చిరంజీవులగు నశ్వత్థామాదులను, కులదేవతను, గురువులను, పెద్దలను, బ్రాహ్మణులను బూజించి వారియనుగ్రహమును, ఆశీర్వచనములను బొందుట. దీనివలన నాయువు వృద్ధినొందుననియు సర్వసుఖములు లభించుననియు నతీంద్రియద్రష్టలగు మహర్షులమతము. ప్రస్తుతము మన శ్రీ తిమ్మరాజుగారు జన్మాంతరీయ సుకృత విశేషమున నాగర్భశ్రీమంతులై సత్కర్మ ప్రవణులై సుఖ జీవనమును గడుపుచు నింకను చిరకాలము పరోపకార పరాయణులై కీర్తిని సంపాదించి జీవితమును ధన్యమొనరించుకొనుటకు ఈరోజునవారి యఱువదిమూడవ వర్ధాపన మహోత్సవము నత్యుత్సాహములో నాచరించుచుంటిరి.

ఇట్టి శుభసమయమున సహజ సాహితీ ప్రియులును, సకల కలాభిమానులును నగు శ్రీ తిమ్మరాజుగారికి సంస్కృతమున శ్రీ క్షేమేంద్ర మహాకవి విరచితంబగు నౌచిత్యవిచారచర్చ యను గ్రంథమును శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు తెలుగులో ననువదించి సమర్పించుట మిక్కిలి యౌచిత్యావహముగ నున్నది. ఏలయన జీవితములో నేపనియందైనను లేశమైన ననౌచిత్యమును జూపక ఔచిత్య సంపన్నముగా వ్యవహరించు శ్రీ తిమ్మరాజుగారి కీ ఔచిత్యవిచారచర్చ సమర్పించుట ఔచిత్యావహము కాదా?

ఇట్లే శ్రీ తిమ్మరాజుగారు ప్రతివర్ధాపనోత్సవమును తమ సుపుత్రులగు శ్రీ చిరంజీవి హరిశ్చంద్రప్రసాద్ గారితోగూడ నేకవేదికాసీనులై పౌత్రాదిబృంద సంసేవితులై జరుపుకొనుచు నూరు సంవత్సరములు జీవించుగాక.

మఱియు లోకమున మానవులు నాల్గురకములు. 1. ఈజన్మమునందుమాత్రమే సుఖపడువారు. 2. ముందు జన్మమున మాత్రము సుఖించువారు. 3. ఈజన్మమునందును, ముందుజన్మముననుగూడ సుఖములేనివారు. 4 ఈజన్మమునను, ముందుజన్మముననుగూడ సుఖము నొందెడివారు. మొదటివారు వెనుకటి జన్మములలో దానధర్మాదులు చేయుటవలన నీజన్మమున వాటి ఫలమగు సుఖము ననుభవించుచుందురు. కాని ఈజన్మమున నట్టి మంచిపనులు చేయకుండుటచే ముందుజన్మమున సుఖముండదు.

రెండవవారు వెనుకటిజన్మమున నేపుణ్యకర్మమును జేయకపోవుటచే నిపుడు దారిద్ర్యాది దుఃఖమనుభవించుచున్నను మంచిపనులు చేయుటచే ముందు ఐశ్వర్యాది సంపన్నులగుదురు. మూడవవారు వెనుకను,

ఇపుడును మంచి నడవడి లేమిచే నిపుడును ముందును గూడ కష్టజీవులుగానే యుందురు. నాల్గవవారు వెనుకను, ఇపుడును మంచిపనులు చేయుటచే నిహపరములందు గూడ నాయురారోగ్యైశ్వర్య సంపన్నులగుచు సుఖించెదరు.

ఈ నాల్గు వర్గములవారిలోను మన శ్రీ తిమ్మరాజు గారి జీవితచరితమును పరిశీలించినచో వీరియైశ్వర్యౌదార్య-సౌజన్య సౌశీల్యాదులనుబట్టి నాల్గవ వర్గమునకు జెందిన ధన్యజీవి యనుట కేమాత్రమును సంశయములేదు. వీరి జీవితశేషముకూడ నితోఽధికముగ ప్రశంసార్హ మగుగాక.

తిమ్మరాజస్య సర్వస్వం
కోశావిజ్ఞాన సంస్కృతీ
న సువర్ణం న రత్నాని
హేతుః ప్రాగ్జన్మ సంస్కృతిః

శ్రీ తిమ్మరాజుగారు గ్రంథములను, విజ్ఞానమును, దయ, క్షమ మొదలగు నాత్మ సంస్కారములనుమాత్రమే ధనముగా భావించెదరు లోకములో సర్వసామాన్యముగా నందరిచే గొప్పదిగా భావింపఁబడు బంగారమందును, రత్నములయందును వారికి ధనబుద్ధిలేదు. లోక విలక్షణ మగు నీభావము వారికి గలుగుటకు కారణమేమనగా వారి పూర్వజన్మమందలి యుత్తమ సంస్కారమే దీనికి కారణము.

అమ్మహాఖని గంభీరః
సమ్మత స్సర్వజీవినాం
మ్మరాజ
కమ్మహత్వాప్నుయాత్సదా॥

శ్రీ తిమ్మరాజు సముద్రునివలె గంభీరహృదయుడు. శత్రువు, మిత్రము, అను విభేదములేక సర్వజీవులకును సమ్మతుడు. అట్టి సుగుణశాలియగు తిమ్మరాజు ఎల్లపుడును గొప్పసుఖము ననుభవించుచుండుగాక.

# సాధువాదము

శ్రీ కాకాని నరసింహారావు

శుభము ఘటింప ముమ్మొదట శోభన దేవతలన్ స్మరించి వా
గ్విభవులు దేశికోత్తముల కీర్తనజేసి హృదంతరమ్మునన్
సభకు సభాధినేతకును సభ్యులకెల్లర కంజలించి ఈ
సభను జయంబొసంగుమని శారదకున్ కరమెత్తి మ్రొక్కెదన్.

ధ్వని మాధుర్యము భావగౌరవము దీవ్యద్వాక్య విన్యాస భూ
షణ సందోహము గోరు ఆంధ్రకవితల్ సర్వాంగ సౌందర్య సం
జనితామోద మొనర్చు నన్నయకవీశానున్ ప్రసాదించి తో
తణుకా ఆంధ్రకవిత్వమందు తళుకా తల్లీ ప్రణామాంజలుల్.

రమ్మని యెంతపిల్చినను రారొకపట్టున లౌక్యులన్న నీ
మమ్మున పమ్మొనర్చి అనుమానముమాని మహోత్సవాని కే
నిమ్మెయి నేగుదెంచి తిలకించితి మేన్ పులకించె నీదు జ
న్మమ్మును ధన్యమున్ సలిపినావు కృతిన్గొని తిమ్మరాడ్విభూ.

కృతి 'ఔచిత్యవిచారచర్చ' కృతి నిన్ సృష్టించె పుంభావ భా
రతి శ్రీ మాధవరామశర్మ కృతిభర్తా తిమ్మరాజే సర
స్వతి పుత్రుండు సభాధినేత సభమున్ ప్రారంభమున్జేయు అ
మ్మతిమన్ముఖ్యు డనంతరాముడు జగన్మాన్యుల్ గదా వక్త లీ
క్షితియం దింతటి సన్నివేశమును వీక్షింపఁగలే రెవ్వడున్.

కావ్యమునకు ప్రచారమ్ము కలుగుగాక
కావ్యకర్తకు సన్నుతుల్ కలుగుగాక
కావ్యభర్తకు కీర్తి కలుగుగాక
విశ్వమున శాంతిభద్రతల్ వెలయుగాక.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ నిడదవోలు మృత్యుంజయరావు (ముత్తయ్యా) గారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ కొండపల్లి అచ్చన్నగారు.

# అభినందనము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

ఈ జన్మదిన మహోత్సవమునకు పిలుపు అందు కొన్న నేను దూరములో ఉన్నను. కొంత అస్వస్థతలో ఉన్నను లక్ష్యము సేయక సమయమునకు వచ్చి ఈ ముచ్చటలో పాల్గొనుటకు ప్రబలమైన రెండు కారణము లున్నవి. ఇది కేవలము జన్మదినోత్సవమేకాదు; 'ఆంధ్రీకృ తౌచిత్యవిచారచర్చాకృతికన్యాసమర్పణమహోత్సవమును.

ఈ పెండ్లివారిలో ఇరువైపులవారు నాకు సన్ని హితులు. మాగ్రామమునకు పొలిమేరలో కొంచెము అవల ఇంటూరు గ్రామమున్నది. ఇంకొకప్రక్క పొలి మేర అనుకొని కోడితాడిపఱ్ఱు కలదు. మొదటిది ఒక విధముగా జమీందారుల ఊరు. రెండవది అచ్చముగా అగ్రహారగ్రామము. ఆ జమీందారులకు ఆరోజులలో ఈ యగ్రహారములోగూడ మడిమాన్యాలు దండిగాఉండెడివి.

'సాహిత్యమండలి' నిర్మాణమునకు మూలకంద మైన 'నరేంద్రనాథుని' మాతామహులగ్రామమే ఇంటూరు గ్రామము. సాహిత్యమండలి వ్యవస్థాపకులైన శ్రీ తిమ్మ రాజుగారికి ఇప్పటి మామగారైన సాహిత్యాచార్యుల గ్రామమే కోడితాడిపఱ్ఱు. అనగా- ఈ మూఁడవ అత్తవారి ఊరు తాడిపఱ్ఱు అన్నమాట. ఈ మామ నేఁడు గుంటూరువారు అగుటచే ఈతీరుగ ఇంటూరు - గుంటూ రులు అత్తవారి ఇండ్లాయెను.

## రెండవ కారణము

ఈ పెండ్లికొడుకుతో- అనగా కృతిభర్తతో ముప్పది నాలుగేండ్ల పరిచయభాగ్యము నాకున్నది కన్యాదాతతో అనఁగా కృతికర్తతో ముప్పదియేడేండ్ల నెయ్యమున్నది. ఈ 'కృతికర్త' వయసులో నాకన్న కొన్ని నెలలు పెద్ద క్లాసులో మూఁడు నాలుగేండ్లు చిన్న. ఇద్దరము కొన్ని మాసాలు తెనాలి సంస్కృత కళాశాలలో ఉన్నాము. అవల అయనది విజయనగరము. నాది చిట్టిగూడూరు నివాసమాయెను. మా'కాలు'లో అప్పటికే విద్యావ్యాసం గములో మంచి ఘటికుఁడుగా ఒక వక్తగా పేరుగడించు కొన్న ఈ మా శర్మ నేఁడు సాహిత్యాచార్యుఁ డగుటలో ఆశ్చర్యములేదు. ఇవి మా సంబంధ బాంధవ్యములు. ఇట్టివారి ఈ ముచ్చటలో పాలుపంచుకొనకుండ నే నెట్లుందును ?

ఈ ముచ్చట అనఁగా ఒకానొక 'పుణ్యపురుషుని' జన్మదినోత్సవము. 1930 లో నేనొకసారి వీరివద్దకువచ్చి నేను స్థాపించుకొన్న 'భాషాపోషక గ్రంథమండలి' పోషకవర్గములో పేరు ప్రకటించుకొనవలెనని కోరితిని. సరేయని అనాఁడు చక్కఁగా సమాదరించి నన్ను పంపిరి. అవల ఈ ముప్పదియేండ్లుగా నాచేసిన రచనలలో ముఖ్యములైనవానిని వీరికి పంపుట నాకొక సంప్రదాయ మైనది.

పండితులు, కవులు పరివేష్టించియుండ, వచ్చిన వారిని వారెంతగా చిన్నవారైనను ఆదరించు స్వభావము తిమ్మరాజుగారికున్నదన్న భావము నన్నెంతో ముగ్ధుని జేసినది. మా ప్రాంతములో భాగ్యవంతులమని విఱ్ఱవీఁగు వారి వైఖరిలో సాహితీరుచి లవలేశమైనను గన్పింపక పోఁగా, పండితులగు కవులను ఈసడించుటయు భిక్షుకు లనువోలె పరికించుటయు కొన్నిచోట్ల కద్దు. ఈగోదావరీ మండలములో శ్రీముళ్లపూడి - శ్రీజవ్వాది, ఈయిర్వురి వెఖరి విచిత్రముగా హృద్యముగా నాకుఁదోచినది. ఐశ్వర్యములో వీరిర్వురు మహేంద్రులైనను భాగ్యములో కుబేరులైనను విద్వత్కవుల పక్షమున కుచేలుల వోలె వినమ్రులై కన్పింతురు. వచ్చిన పండితుఁడుగానీ కవీశ్వరుఁడు గానీ వీరిని జూచి రిక్తహస్తములతో శూన్య హృదయముతో వెనుదిరిగి పోవఁడని చెప్పుకొందురు.

ఆసంప్రదాయమే ఇట్టివారికి ఈ మంచితనమును తెచ్చి యిచ్చినది. కానిచో, ధరణిలో ధనవంతు లెందఱులేరు. భూస్వాములెక్కడలేరు? వారి ఊరుపేరులైన స్మరింప వలసిన అక్కఱ మనకేమున్నది? గ్రంథస్థము కాఁదగిన యోగ్యత వారికెక్కడిది?

ఈ శ్రీ 'ముళ్లపూడి'వంగడములో నాల్గు'తరాలను' నేను జూచితిని. శ్రీ రాయఁడు - ఒకవిధముగా 'ధనంజయు'ని వంటివాఁడు, తృణశః- కణశః, అన్నట్లు అంతలావు ఆస్తిపాస్తులు స్వయము గడించియిచ్చి భద్రత కూర్చి పోయెను. ఆయనకు ఏకైకపుత్త్రుఁడు శ్రీ తిమ్మరాజు పితృవాక్యము దాఁటని బుద్ధిమంతుఁడు. ఆయనబిడ్డ శ్రీ హరిశ్చంద్రప్రసాద్. వారి కుమారుఁడు శ్రీ వేంకటరాయఁడు.

లోకములో ప్రాయికముగా 'పండితపుత్త్రుఁడని- పనివాని కడుపున తినేవాడు పుట్టునని' సామెతలు చాల వఱకు సత్యమునే చెప్పుచుండును. దీనికి అపవాద సూత్రములు - విపరీత లక్ష్యములు ఎక్కడనో ఒక్కెడ కన్పించును. అనఁగా వ్రేళ్ళలెక్కలో అట్టివారు ఉందురని భావము. ఆ మోతీలాలుకడుపున జహ్వారిలాలు పుట్టెనఁగా ఆ జోగయ్య పంతులబిడ్డ వెంకటగిరి ఉన్నాఁడనఁగా- ఆ 'పాకాలనాయని' పుత్త్రుఁడు రాజమన్నారు ముమ్మొదటి ప్రధాన న్యాయమూర్తి అయ్యెననఁగా ఇదేధోరణి. ఈకోవలోనే ఈ కుటుంబము సైతము నాకుఁ గన్పించుచున్నది. ఇప్పటి ఈ నాల్గు తరములలో, శ్రీరాయఁడు సృష్టించి యిచ్చినది 'రాజు' రక్షించి యుంచెను. మూఁడవమూర్తి త్యాగమూర్తి వచ్చెను, పూర్వపూర్వముకన్న ఉత్తరోత్తరము బలీయ మన్నట్లు ఈమూఁడవ మూర్తి బ్రహ్మాండమైన లాభమునే రేయుంబవలు గడించుచున్నాఁడు. పారిశ్రామికముగాఁ గాదు సుమా! పారమార్థికముగా. అనఁగా - ఎఱ్ఱను వేసి చేఁపనులాగినట్లు కొన్ని లక్షలు ఈప్రసాద్ లోకమునకు ప్రసాదించి అమూల్యమైన శాశ్వతమైన కీర్తి ధనమును మూటఁగట్టుచున్నాఁడు. ఇంత లేఁబ్రాయములో తండ్రికి విధేయుఁడై రాజకీయములలో మెలకువగా నడచుచు, పారిశ్రామికముగా మంచి మార్గములు త్రొక్కిన వారు దేశములో తక్కువగా ఉందురు. విశిష్య - తెలుఁగు గడ్డలో ఇట్టిబిడ్డలు లేరేమో! 'త్యాగాయ సంభృతార్థానామ్' అన్న కాళిదాసు మాటకు హరిశ్చంద్రప్రసాద్ చరిత్ర అక్షరాల లక్ష్యమై ఉన్నమాట స్తవముకాదు; వాస్తవము. 'బాపుజీ' పదేపదే చెప్పిపోయినది ఈయుపదేశమే. దైవ మిచ్చిన ఆస్తి పాస్తులు నీసొంతమని భావింపకుము; వానికి 'ధర్మకర్త'గా నీవుండి లోకారాధనమునకే వానిని వినియోగింపుము. అప్పుడే నీజన్మము సార్థకమగును. ఇదియే ఆయనవాదము. ఇంతకన్న 'సామ్యవాదము' లేదు. ఇది నాదేయని విఱ్ఱవీఁగి ఇలియుబలియు లేనినాఁడు విప్లవమే పుట్టుకొనివచ్చి పల్లములు మెఱకలు ఒకేస్థాయికి రావచ్చును. ఇంత మంచిచూపుతో ఇన్నిన్ని మంచిపనులు చేయుచున్న త్యాగమూర్తిని కుమారుని జూచుకొని ఆతండ్రి ఎంతసంబరపడునో ఊహింపలేము. ఈయదృష్టము ఎవ్వరికోగాని దక్కదు. తండ్రిగారి సమ్మానము కొడుకు చూచుట; కుమారుని సమ్మానము తండ్రి చూచుకొనుట, ఇంతకన్న లోకములో కావలసిన దేమున్నది? వర్ధమానుఁడగు శ్రీ వేంకటరాయని వైఖరి ఈబాటలో మేటియై పూర్వులకు పేరు తెచ్చుచు నవ్యులకు ఆదర్శమూర్తిగా రాణింపఁగలదనియే నాయెందునమ్మకము.

## కృతిసమర్పణము

ఈ 'కృతి' 'ఔచిత్యవిచారచర్చ'. కృతికర్త నామిత్రుఁడు శ్రీమాధవరామశర్మ. కృతిభర్త శ్రీతిమ్మరాజు చౌదరి. కృతికి - కృతికర్తకు తగిన కృతిభర్త, దొరకుట ఈ ఔచిత్య విచారచర్చలో మొదటి యౌచిత్యము. మాధవరామశర్మను మాధవరాయశర్మ యనియు కొందఱు భ్రమింతురు అనఁగా - ఆభ్రాంతిలో ఆయన 'రాయఁడు' అయ్యెనన్నమాట, ఈ'రాయని'కి గురూణాం గురువులు శ్రీ 'తాతారాయఁడు' గురువులు. ఈకృతిభర్తకు 'రాయఁడు' గురువు; అనఁగా జనకుఁడు, 'రాయఁడు' శబ్దమునకు మూలమైన 'రాజు' శబ్దము కృతిభర్త పేరులోనే ఇమిడి యున్నది. ఇదియు - ఇంకొక ఔచిత్యమేమో!

కథావస్తువు మహాపురుషునకు చెందియుండుట గానీ కావ్యమును మహాపురుషున కంకితము చేయుటగాని మనకు ప్రాచీన సంప్రదాయమే. శబ్దాహ్వయమైన జ్యోతి 'అటు - ఇటు' తరింపఁజేయును. ఈ జ్యోతి లేనిదేశము ప్రదేశము అంధతామిస్రమే అన్నమాట. ఈమాటనే దండి మహాకవి దండిగా ఇట్లన్నాఁడు:—

శ్లో. ఇద మంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.

శ్లో. ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి.

శ్లో. వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే.

శ్రీరాముఁడెప్పటి వాఁడు? వాల్మీకి ఏనాఁటివాఁడు? కవితాశాఖపైఁ గూరుచుండి ఆ కవికోకిలము కూయుటచే తనే, యుగయుగాలుగా ఆ యవతారమూర్తి రామయ్య మన కన్నుల మ్రోలఁ గన్పట్టుచున్నాఁడు. ఇదే కవిసృష్టి.

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
... ... ... యదస్మై రోచతే సర్వమ్'

పైగా ఆసృష్టికర్తకు ఈసృష్టికర్తకు చాలభేదమున్నది. ఆ బ్రహ్మ సృష్టించినవి నశింపవచ్చును. ఈకవిబ్రహ్మ సృష్టించినవి నశింపవు, బ్రహ్మకన్నను కవిబ్రహ్మ, ఒకవిధముగా మిన్నయని యనవచ్చును. పైగా, ఈశ్వర శబ్దముకూడ కవికిచ్చిరి.

కవిరాజు -కవిబ్రహ్మ- కవీశ్వర, ఈపదములను బట్టియే ఆతని విశిష్టత స్పష్టమగును - అతనిచేతిలో పడినచో పందియు నందియగును. కురూపి సురూపి యగును. ఈరహస్యమెఱిగి ఎందఱెందఱో పూర్వులు సత్కవులను ఆడిగి - ఆరాధించి అంకితములు పుచ్చుకొనిరి. కవీశ్వరునకుఁగల ఘనత ఒక్కభారతదేశమందే కాదు; ఒక ఇంగ్లీషు వానిని ఒకానొకఁడు ప్రశ్నించెనఁట. ఏమని? 'షేక్స్పియర్ మహాకవి - హిందూదేశము'— ఈరెండింటిలో ఒకటి విడువవలసివచ్చుచో ఏది నీకుఁ గావలె నని. ఆర్థికముగా హైందము అఖండమున జీవాతువే అయినను మహాకవిని విడువలేనని అతఁడు చెప్పెనఁట. దీనిభావమేమి? ఇదేమాటను మనవాండ్రును 'కవితాయిద్యస్తి రాజ్యేనకి' మ్మని ప్రశంసించిరి. కావుననే రాజులకన్న కవిరాజులు ఘనులనియు. సమ్రాట్టులకన్న కవిసమ్రాట్టులు సర్వశ్రేష్ఠులనియు సార్వకాలికముగ సార్వదేశముగ ఉన్న సిద్ధాంతము.

ఇక్కడ - ఒకరు శ్రీ తిమ్మరాజు; ఇంకొకరు సాహిత్యసమ్రాట్టు. రాజులయు సమ్రాట్టులయు సంబరము ప్రజలకు సైతము సంబరమేయగును. ఈకృతికన్యా 'సమర్పణస్వీకరణముల'లో ఒకముచ్చట నాకుఁదోఁచినది:

అల్లుఁడు శ్రీ తిమ్మరాజు యయాతి మహారాజు. మామ, దర్శనాచార్యులు శుక్రాచార్య శ్రేణివారు. 'ఔచిత్యవిచారచర్చా' కన్య, దేవయాని. శుక్రాచార్యులు చెప్పినదే వేదము ; అతఁడు చేసినదె ఆచారము. ఏదో కారణముండి దేవయాని, విలాసముగా ఆమహారాజునకు భార్యఅయినను శర్మిష్ఠాపుత్త్రుఁడు పూరుఁడే పితృవాక్య పరిపాలనా దక్షుఁడై వంశకర్తగా వెలసెను. అపూరుని వంటివాఁడే ఈబిడ్డ హరిశ్చంద్రప్రసాద్. ఏతద్వంశాంకురమే దుష్యంతునిబోలిన శ్రీ వేంకటరాయఁడు. ఇది - విరి సాంసారిక సంబంధము.

కాని, ఒక్క 'దేవయాని'తో ఈ సంసారనౌక సాగనేరదు. అఱువదిమూఁడవ యేఁట - ఇట్టి జవసత్త్వములతో వెలసిన ఈ తిమ్మరాజుభూపతి, చిరకాలము ఎన్నెన్నో జన్మదినోత్సవములు జరుపుకొనవలెననియు, ఏటేఁట ఎంద ఱెందఱో 'దేవయానులు' ఇంటికి రావలెననియు, ఇట్టి మహోత్సవము ఉభయతారకము కావలెననియు 'మృష్టాన్న మితరే జనాః' అన్న 'లిస్టు' లోని అస్మదాదుల ఆకాంక్ష.

## 'ఔచిత్య విచారచర్చ'

నాట్యశాస్త్రకర్తయైన భరతముని మొదలు సాహిత్య దర్పణకర్త విశ్వనాథుని వఱకు కావ్యనిర్వచనములో ఎన్నెన్నో త్రోవలువెలసినవి. 'రసమే' కావ్యాత్మయని భరతుఁడు చెప్పఁగా - అలంకారసహిత శబ్దసముదాయమే కావ్యాత్మయని భామహాదులు వర్ణించిరి. దండి మహాకవి

మతములో 'గుణమే' కావ్యాత్మ. 'ధ్వనియే' కావ్యాత్మ యని ఆనందవర్ధనుఁడు. 'వక్రోక్తియే' కావ్యాత్మయని కుంతకుఁడు. 'అనుమానమే' ఆత్మయని మహిమభట్టు నిరూపించిరి. ఔచిత్యవిచార చర్చా కర్త క్షేమేంద్రుఁడు 'ఔచితియే' కావ్యాత్మయని నిర్ణయించెను. ఈయందఱు ఎన్ని కారణములు చూపినను - ఎన్ని యాత్మలు నిర్ణయించి నను అలంకార శాస్త్రమంతయు 'రసము'తో ప్రారంభమై పోయిపోయి 'ధ్వని' మతములో నిలిచిపోయినది. అదియే నిజమైన కావ్యాత్మయని అనేకుల సిద్ధాంతముగా గ్రహింప వచ్చును. ఈధోరణిలో 'రసాలంకార గుణరీతి' మతములు ప్రాచీనములుగా, 'ధ్వని - వక్రోక్తి - అనుమాన - ఔచితీ' మతములు నవీనములుగా కొందఱు వ్యాఖ్యాతలు నిరూపించిరి. కుంతకుని తరువాత క్షేమేంద్రపండితుఁడు చేసిన నూతన సిద్ధాంతమే ఈ 'ఔచితీ సిద్ధాంతము.' ఆయన చెప్పిన మాటలివిగో!!

శ్లో. ఔచిత్యస్య చమత్కారకారణ శ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా।

శ్లో. కావ్యస్యాల మలంకారైః కిం మిథ్యాగణితైర్గుణైః
యస్య జీవితమౌచిత్యం విచింత్యాపి న దృశ్యతే।

శ్లో. అలంకారా స్త్వలంకారాః గుణా ఏవగుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్.

కావ్యజీవితమైన ఔచిత్యమే లేనిచో అలంకారము లెందులకు? మిథ్యాగణితములైన గుణము లెందులకు? అనఁగా ఔచిత్యము లేనినాఁడు గుణాలంకార సౌందర్యము శూన్యమని భావము కావున, రసవంతమగు కావ్యమునకు 'ఔచిత్యమే' జీవితమని క్షేమేంద్రుని సిద్ధాంతము.

ఈ ఔచిత్యమన్నది, పదములో - వాక్యములో - ప్రబంధములో - గుణములో -అలంకారములో - రసములో - క్రియలో - కారకములో - లింగవచనములలో - విశేషణములో - ఉపసర్గలో - నిపాతములో - దేశ కాలములలో - కులములో - వ్రతములో - తత్త్వములో - సత్త్వములో - అభిప్రాయములో - స్వభావములో - సార సంగ్రహములో - ప్రతిభలో అవస్థలో - విచారములో - నామమ్మ్లో - ఆశీస్సులో, ఉండవలెనని క్షేమేంద్రుని వాదము. అనఁగా ఈతీరుగ కావ్యాంగములందంతటను ఔచిత్యము ఉండవలెననియు, అప్పుడే అది మహాకావ్యమై రాణించుననియు పిండితార్థము. దేనికేది తగునో అది ఉచితము. ఉచితస్వభావమే - ఔచిత్యము. 'అనౌచిత్యా దృతే నాన్యత్ రసభంగస్య కారణమ్' అనౌచిత్యముకన్న రసభంగమునకు కారణములేదఁట.

ఈ లక్షణమునకు తెలుఁగులో దిక్సూచిగా ఇవిగో లక్ష్యములు :—

'గరుడుండు తల్లి కిట్లనియె'

'పాయక యొమ్మునందెప్పుడు
పాముల మోవను వారికిం బనుల్
సేయఁగ నేమి కారణము సెప్పుము
నాకుఁ బయోరుహాననా!

అని నన్నయ్య, భారతములో బిడ్డయైన గరుత్మంతునిచే తల్లిని 'పయోరుహాననా' అని సంబోధింపఁజేయుటలో కొంత అనౌచిత్యము లేకపోలేదు. ఇట్లే రామలింగకవి, నిగమశర్మ ఘట్టములో ఇట్లన్నాఁడు :—

'ఏనమ్మఁడు గడవఁగఁ దత్సానులు కసుగందు లగ్రజన్ముఁడు' 'పడఁబడఁబాఱుచున్ వడఁకు పట్టిన తల్లిని దండ్రి నేలలో వెడలని తమ్ము గుబ్బల' — నిగమశర్మ తల్లిదండ్రులు వడఁకుపట్టిన ముదుసలులఁట. వారికి నేలలో పారాడు పసిబిడ్డలు ఉన్నారట ఇదియుఁగొంత 'అసందర్భము'గా స్ఫురింపవచ్చును.

## అనువాదము

క్షేమేంద్రుని దృష్టిలో ఇట్టివి అనౌచిత్యములని భావము.

స్తనశల్య పరీక్షగా ఇట్టి యంశములనేకములను సమీక్షించిన 'ఔచిత్య విచారచర్చా' గ్రంథమును తెలుఁగు నకుఁ దెచ్చి శర్మగారు మంచిపనిచేసిరి. ఈశాస్త్రగ్రంథమునే వెనుక 'వేంకటరామకృష్ణ కవులు' అనువాదము చేసిరని వింటిని. లక్షణ గ్రంథములను గొన్నింటిని వేదమువారు -

ఆవ్వారివారు - వేదులవారు - సన్నిధానమువారు - తెలుఁగునకు తెచ్చియుండిరి. కాని వీనిలోఁగొన్నింటిని జూడఁగా అనువాదముకన్న మూలములే చక్కఁగా అర్థమగునట్లు నడచినవి. అట్టియనువాదముల వలన తెలుఁగువారికి కలుగవలసిన లాభమేదియులేదు. ఇఁక మనశర్మగారి యనువాదమును గూర్చి నేను జూడకయే ఊహించుట మంచిదికాదు గాని, ప్రాయికముగా వీరి రచనయు ప్రౌఢముగా పరిఢవించియుండ వచ్చునని భావింతును. ఏదియేమైనను శాస్త్ర గ్రంథములను తెలుఁగునకుఁ దెచ్చుటలో - తార్కికవాసన లేని తెలుఁగు వారికి నచ్చునట్లు అనువదించుటలో ఇబ్బందిలేక పోలేదు. 'విద్యానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్.

ఇంత మంచిపనిచేసిన శర్మగారిని - ఆయనచే ఈపని చేయించి ఆయనను ఆనందపెట్టిన రాజుగారిని, నిరవకాశమైన ఈసమావేశ ఘట్టములో అవకాశమిచ్చిన సభానిర్వాహకులను అభినందించుచు విరమింతును.

# జన్మదినోత్సవ కృతి కన్యావరణోపహారము

శ్రీ ద్వివేది సూరి

శ్రీవాణీగిరిజా స్తదీయపతయః తేషాం ప్రభావోచితం
మార్కండేయమహాయురాదికధనం దద్యాసు రస్మై ధ్రువమ్
లక్ష్మీలాలితశారదాముదితగౌరీపోషితాయ ప్రభా
పాత్రభవ్యాత్మజతిమ్మరాజవిభవే కావ్యాబ్జినీభానవే.

సరస్వతీనూపురకంఠమాలాసువర్ణభూషాకరవంశజాతాం
శైలస్తనీం కోమలశాస్త్రకన్యాం వృణోతి ధన్యః కిల తిమ్మరాజః
మాధుర్యసారాంబుధిశాస్త్రకన్యాలావణ్యపీయూషధురీపిపాసా
సాహిత్యకన్యాస్తనకుంభపాలకే హితోధికం వర్ధతు తిమ్మరాజే.

యువకులు సాహితీనవరసోర్మిగళత్కలహంసమాధురీ
కవితకు చొక్కి మ్రొక్కి తమ కమ్మదనమ్మున నాచికొందు రా
జవ ముడివోయినట్టి ముదుసళ్ళకు చెక్కిలి నొక్కి వాస్తవ
ప్రవణత జూపు శాస్త్రరమరక్తికి భక్తిని దోయిలించెదన్.

ముత్యపుజల్లు లుల్లసిలుమోహనవాణి నరేంద్రనాథ సా
హిత్యసభాంతరాళముల కేడ్గడయై విలసిల్లునంచు నౌ
చిత్యరసధ్వని ప్రణయశీలు రలంకృతికాముకుల్ మహా
ప్రత్యయబుద్ధి నాశిషము లానిరినా డదినేడు కాంచితిన్.

చాలఁగాలము దేశముల్ తిరిగి కృష్ణావాహినీమోహినీ
వ్యాలోలచ్ఛఫరీనిరీక్షణను తానై యీతఁడే కోరెనో
ఆలంకారిక సార్వభౌముల అపత్యమ్మైన యీ యౌచితీ
రోలంబాలక యస్మదీయపతి నాలోకించి మోహించెనో!

బ్రతుకు గడించినందులకు లాభము కీరితి ప్రోవు సేఁత; భా
రతిముఖమందు నారతి మలంచుటపై రతి కల్గెనేని కీ
రితి యఱచేతి కుందనము; రేబవ లిర్వురి గూడగట్టు నౌ
చితిని వినాకరించుటది చెట్టదనానకు దారకాణమౌ.

## జన్మదినోత్సవ కృతి కన్యావరణోపహారము

కమ్మదనమ్ము తీపియును కారము ఘాటు ఘుమంఘుమార్భటీ
రమ్మదచిత్రశైలియు బురాణిలు కావ్యము లెన్నకున్న వెం
కమ్మయు గమ్మయౌను, గరిగమ్మయు కమ్మయె యంచు నెంచి మా
తిమ్మనృపాలు డౌచితి గదించి వరించెను మాధవాత్మజన్.

కవులకు కావ్యకన్యక లెగాక మనోహరశాస్త్రమాధురీ
యువతులునున్ జనింతురనియున్ గ్రహియించి శ్రమించి తిమ్మభూ
ధవుడొక శాస్త్రకన్యకను తన్మయుడై వెతికించి తెచ్చి యీ
సవతుల మధ్య నిల్పి సరసమ్ములకుం దిగుటెల్ల నౌచితీ
భవరసపానమత్తమధుపమ్మగుటా! అని అబ్రమయ్యెడిన్.

రసముల రూపకల్పన కలంకృతి నిర్మితి చాకచక్యపుం
బస జనియింప నౌచితియె మాత గదా! తగదా! వరింప, నీ
యెసకముజూచి ముగ్ధుఁడగు నే నల లచ్చికి బచ్చునైన నీ
రసికత కొక్క దోసెడు వరాలిడి మ్రొక్కనె తిమ్మభూపతీ !

ఇది ప్రభుసమ్మితమ్ము తమకెట్లు లభించెనొ పూర్వపుణ్యపుం
బడుసున తాముకూడ ప్రభువర్యుల ఇర్వురు శాసనప్రియుల్
ప్రిదులుట కూడినప్పు డల పిల్లలమఱ్ఱుల సత్కవీశ్వరా
స్వపదమగు పేరుటోలగము పమ్ముడు శాంతిలభించు భూవరా!

కృష్ణదేవమహారాయు డేలినట్టి అష్టదిగ్గజములకును పుష్టి తుష్టి
హితము గూర్చిన దిద్ది క్షేమేంద్రు బిడ్డ ఔచితీకన్యకోపగూహనసుఖమ్ము
తెల్గువారికి ప్రేమనందించినట్టి మాధవా! రామశర్మ! నమశ్శతమ్ము.

కావ్యనవోఢల కౌఁగిలింతలలోన
నొక కొంతకాలమ్ము సుకముగాంచి
సాహితీమోహినీచకచకత్ప్రభలతో
గాలమ్ము నొక కొంత గడపి గడపి
లలితకళాదేవిలాస్యభంగిమలందు
మొనమొన్నదాక ఆమోదమంది
సంగీతవాణికి చక్కిలిగింతల
ముద్దులతో గొన్ని పూటలలరి
ఔచితీకన్యకకు మోమువాచి వాచి
గౌతమికి మ్రొక్కి శ్రీకృష్ణ గట్టుదాటి
ఒక్క పిల్లలమఱ్ఱిపై కెక్కి చూచి
సాహితీశాస్త్రసాగరోజ్జ్వలతరంగ
కన్యకన్ తిమ్మభూపతి కని వరించె.

చంపకోత్పలమాలికాసౌరభములు లేవు లేవాట వెలఁదులు లేవు నగలు
పాలసంద్రము మథియింప బ్రభవమైన వెన్నపూసగదోయి యిందున్న సరుకు.
కుంఠేతరమతి వాణీకంఠాభరణులును ప్రౌఢకవులును, విద్వ
త్కంఠీరవులును కవికలకంఠులుగల నేటి సభకు కైవారమ్ముల్.

జనకాతీతకుమారుఁ డొక్కఁడె హరిశ్చంద్రప్రసా త్తిమ్మ భూ
జనపాలుం, డల 'మోతిలా ల్జవహరుల్' సామ్యానకున్ వచ్చుచో
ఎన కాగా, దట నేటి యౌచితియు లేదే! ఔచితీకన్యకా
ద్యనవద్యల్ తమ చెట్టవట్టుటలు నెందైనం గనం జెల్లెనా!

రతనపు ముక్కలోని కళలం గికురించెడి కీర్తి నేలు నీ
సుతునకుఁగూడ నీకవితసొత్తున భాగము పంచితేని సా
హితికొక యంత్రకోటిని సృజింపగలాడు రసప్రవాహ ని
ర్మితమ్మృదుకీర్తివాహిని దరింతుము స్నానములాడి కాల మా
యతముగ సంధ్యవార్చుకొని యర్ఘ్యము లిత్తుము తద్రసమ్ముతో

పారిశ్రామిక సార్వభౌముఁడగు భూపాలుండు నీ బిడ్డ, వా
క్పారావారము లీదు సత్కవుల విజ్ఞానాబ్ధిజన్యామృత
శ్రీరమ్యమ్మగు భుక్తి నీది, పితకీర్తిన్ పుత్రుడున్ సాహితీ
పారిశ్రామికసార్వభౌముఁ డనుమేల్వాసిన్ మిటారించుతన్.

సరస్వతీపుత్రపురోహితత్వే కృతీశ్వరేఽస్మిన్ రసికావతంసే
క్షేమేంద్రసంభావితదివ్యవాణీ మహానసౌచిత్యరుచిం భజన్తామ్,



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ యలమర్తి నారాయణరావుగారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ నెక్కంటి వెంకటరామయ్యగారు.

కొత్తవెలుగు సంపాదించెను. విశేషించి కుప్పుస్వామిగారి సర్వతోముఖవైదుష్యము శ్రీముళ్ళపూడి కుటుంబము వారి గుణరత్నముల కొక నికషోపలమైనది. దీనితో శ్రీముళ్ళపూడి గుణరత్నముల వెలుగు మిన్నందినది. తిమ్మరాజుగారి జీవితచరిత్రయందొక నూతనాధ్యాయము అరంభమైనది.

'దత్తభుక్తఫలమ్ధన' మ్మను నాందీగీతముతో విశ్వకల్యాణమున కుపక్రమించు కార్యములు చేపట్టిరి. లోకజ్ఞులగు తిమ్మరాజుగారు లౌకిక వ్యవహారభారమంతయు హరిశ్చంద్రప్రసాదుగారి భుజస్కంధముపై నిడి యాజమాన్యమంతయు నొప్పగించి ప్రసాదుగారిని పిత్రు మంతుని చేసిరి. ఆగర్భశ్రీమంతులయ్యు ప్రసాదుగారు గర్వమెరుగరు. విద్యావినయ సంపన్నులు, వారిమూర్తి ప్రసాదమాధుర్యముల సమాహారము. గభీరముద్ర గల వారి ప్రకృతి చూచిన సర్వోదయనాటకప్రథమరంగమునకు భద్రగీతివలె అస్మదాదులను ఆనందింపచేయును. ఇట్టి ఉదాత్తగుణసంపన్నులగువారిని పెత్తనమే వలచి వచ్చి వరియించును. వారెన్నడును పెత్తనము కావలెనని కోరరు. ఇది లోకస్వభావము.

క. హరికెవ్వరు సంస్కారము
గఱపిరి పట్టంబు నెవరు గట్టిరి వనిలో
గురుశౌర్యార్జితవనమృగ
పరివారుంజూచి యతనిఁ బ్రభుఁయె వలచెన్.

(మదీయము)

అని కదా ఆర్యోక్తి. ప్రసాదుగారు సంప్రదాయ విద్యా సంస్కారులగుటే కాక ఇతరములగు ఆంగ్లవిద్యాదిసంపన్నులుకూడ నగుటచే శాస్త్రజ్ఞానమునకుతోడు లోకానుభవము సంపాదించి పరిణతబుద్ధులైన ప్రసాదుగారు భావి భారత ప్రజాజీవితమునకు వలయు అనేక విద్యాలయములు, పరిశ్రమ యంత్రాగారములు నెలకొల్పిరి. అతిథిపూజావ్రతులు, స్ఫురద్రూపులు, హసన్ముఖులు. ప్రసాదుగారి ఔదార్యమునకు వారి వినయము, స్నిగ్ధ ప్రసంగము వన్నెతెచ్చినవి. ప్రసాదుగారి కుమారుడు చిరంజీవి వెంకటరాయుడు తండ్రిగారి ప్రతిబింబము. ఆకారరేఖలలోగాని వినయసౌశీల్యాది గుణసంపదలోగాని తండ్రితాతలకు పేరుదెచ్చు బుద్ధిమంతుడు.

సకల సంపదలకు అధికారియై తన కండ్లయెదుటనే తనకుమారుడు ప్రయోజకుడై అసంఖ్యాక ప్రజాజీవిత సంస్థలను దిగ్విజయముగా నిర్వహించుచు కుటుంబము యొక్క గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడింపజేయుచుండగా చూచు భాగ్యము ననుభవించు మన తిమ్మరాజుగారివంటి అదృష్టవంతులు ఉండుట అరుదు. జీవితసౌఖ్యమునకు వలయు సకల సౌకర్యములు గల తిమ్మరాజుగారికికూడ విషాదయోగము తప్పలేదుగదా! ఆహా కాలప్రభావమును ఏమనగలము? విధి బలీయమైనదిగదా!

మధురవిధురమిశ్రాః సృష్టయో హా విధాతుః

జీవితము మాధుర్య వైధుర్యముల మిశ్రమముగదా! తిమ్మరాజుగారికికూడ జీవితములో దుఃఖానుభవము తప్పలేదు. ఇది తీరనిది. దానవీరుడు. బాల్యాదికూడ బీద విద్యార్థులకు అనాథులకు గుప్తదానము చేయువాడు. ఋషీవాలీలోని గురుకులమందు అధ్యయనము చేయువాడు, ప్రహ్లాదునివలె తల్లిగర్భమునుండియే భక్తిప్రపత్తులతో అవతరించిన శ్రీముళ్ళపూడి కుటుంబ భాగ్యము హరిశ్చంద్రుని కుడిభుజము తిమ్మరాజుగారి పుణ్యరాశి నరేంద్రనాథుడను కుమారసింహము తన పదునారవ యేటనే హఠాన్మృతి పాలయ్యెను. ఎంత ధీరోదాత్తుడయ్యును తిమ్మరాజుగారు ఈ పుత్రవియోగముతో క్రుంగిపోయిరి. ఇప్పటికినిగూడ నిత్యము ఒక ముహూర్తము పాటు నరేంద్రుని తలచుకొని తిమ్మరాజుగారు బాష్పాకుల లోచనులై కుమిలికుమిలి దుఃఖించుచుందురు.

అనిర్భిన్నగభీరత్వాదంతర్గూఢ ఘనవ్యథః
పుటపాకప్రతీకాశో — కరుణోరసః

అన్నట్లు తిమ్మరాజుగారెంత గభీరప్రకృతి గలవారైనను ఈ పుత్రవియోగ శోకరసము పుటపాకప్రతీకాశమై క్షణక్షణమును వేధించుచుండును మఱువగరాని ఈబిడ్డ పేరును లోకమందు చిరస్థాయిగా నెలకొల్పుటకు సంకల్పించి తిమ్మరాజుగారు 'శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి'

అను పేరుతో నొక ఉత్తమ గ్రంథప్రచురణసంస్థను నెల కొల్పిరి. ఈసంస్థ నిర్వహణార్థము అమూల్యమగు ముద్రణాలయమును, అందులకు వలయునంత ధనమును సాహితీమండలికి ప్రసాదించిరి. ఈ నరేంద్రనాథ సాహితీమండలి పేరున అనేకములగు ఉత్తమ సాహితీ గ్రంథములను ప్రకటించిరి. ప్రకటించుచున్నారు ప్రకటించగలరు. నరేంద్రనాథుని పేర తిమ్మరాజుగారు చేయుచున్న సాహితీసేవ భారతభారతిచరిత్ర యందొక నూతనాధ్యాయము సృష్టించినది. కాలగర్భమున దాగియున్న ఆంధ్రవీరులయొక్కయు, రాజన్యులయొక్కయు చరిత్రను వెలికిదీయుటకు వీరుచూపు ఉత్సాహము నిరుపమానము. ఏదైన ఒక ఉత్తమ చరిత్రాత్మకమైన గ్రంథనామము చెవినిబడినదే తడవుగా ఎన్ని వ్యయప్రయాసలకోర్చి యైననుసరే ఆ గ్రంథమును సంపాదించితీరెదరు. అమూల్యమగు వీరి జీవితకాలమంతయు చరిత్రాన్వేషణ కొరకును ఉత్తమగ్రంథసంపాదనకొఱకును వ్యయించు చుందురు. సాహిత్యమ్మన్న వీరికి తరుగని ఆసక్తి. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారిచే అనూదితమైన క్షేమేంద్రుని 'ఔచితీవిచారచర్చ' అను శాస్త్రగ్రంథమును వీరు కృతి తీసికొనిరి. ఈ కృతిస్వీకారమహోత్సవ సందర్భములో వారి 61వ జన్మదినోత్సవమును పురస్కరించుకొని ఆనాటి సామాజికులలోని అస్మదాదులము సాహితీలోలుపత్వమును చక్కగా విచారించి 'సాహితీవల్లభ' అను బిరుదమునకు శ్రీ తిమ్మరాజుగారు అర్హులని నిర్ణయించి ఈ బిరుదముచే ఆనాటి సభాధ్యక్షులగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులగారి ద్వారమున తిమ్మరాజుగారిని భూషించితిమి.

సంపన్నులేకాక బహుముఖప్రజ్ఞాశీలురై, సాహితీనిష్ఠులై కావ్యకవితావినోదులై, రసికులై కవితా సరస్వతీపూజ సాగించుచున్న మా తిమ్మరాజుగారు మొక్కవోని ఆరోగ్యముతో నూరేండ్లు జీవింతురుగాక! సుకవిరాజన్యుల కృతులకు చేతులొగ్గుదురుగాక! రసజ్ఞుల హృదయ క్షేత్రమును పాలింతురుగాక !

# "శుభం భూయాత్"

శ్రీ చిరంజీవి వేంకట సూర్యనారాయణరాజు

ఒకచాయ వేదమంత్రోచ్చారణప్రభ
వప్రమోదకలితభావరేఖ
ఒకమ్రోల కవిపండితకుటమ్ము గురిపించు
మధురవంబుల పద్యమౌక్తికములు
ఒకక్రేవ స్నేహమల్లికలు పూయించెడు
మిత్రపుంగవుల సమ్మేళనమ్ము
ఒకపొంత ననుబంధ ముదయింప గవియు బం
ధుజనప్రగాఢబంధుత్వశోభ

లిన్ని యొకదానికొకటి మేల్వన్నె నిడగ
జన్మ సార్థకత వహింప జాలినంత
శక్తిసామర్థ్యములుగల్గు సరసమతివి
దీనపోషకమన్నార !! తిమ్మరాజ !!

ఉత్తమచరిత్రులైన మీరూహకంద
రాని జన్మోత్సవానందరాశి దేలు
చుండగా జూచిన సహృదయుల కపూర్వ
పర్వమై తోచుగద !! గుణవర్ధమాన !!

కవుల దీవన గైకొని గాంచి యశము
విశ్వమందున వరలుము వేయియేండ్లు
అస్తు దీర్ఘాయురారోగ్య మస్తు మీకు
సిరుల వర్ధిల్లు సతతంబు తిమ్మరాజ !!



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ చిట్టూరి సూర్యనారాయణ, B. Sc. (Agr.) గారు.



'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని
సమ్మానిస్తున్న
శ్రీ జలగం సత్యనారాయణగారు.

# కావ్యపుష్పోపహారము

శ్రీ టి యస్. ఆర్. అప్పారావు

మ.  ఒక దివ్యోత్సవగానమాధురి వసంతోద్యానవీథీసరో
వికచాంభోజమరందమాధురియు గోపీమంజులాహ్లాద వ
ర్ధకమౌ వేణునినాదమాధురియు సంధానించి దీపించు కా
వ్యకళావైఖరిఁ బ్రోవుమమ్మ జననీ ! వాగీశ్వరీ! భారతీ !

మ.  ఇది సారస్వతభోగభూమి, వరసాహిత్యాభిమానప్రభా
స్పదుఁడై వర్ధిలు తిమ్మరాడ్రసికపూజావేది, సత్కీర్తి సం
పదకై కాంక్షగలట్టి కావ్యసుదతీమాంగళ్యమున్ బ్రోచు కో
విదసన్మాన్యుఁడు తిమ్మరాజునకు వేవేల్ సత్కృతుల్ గూర్చి శా
రద యీ ధన్యునిఁ బ్రోచు జన్మదినముల్ రాజిల్ల వేయేండ్లకున్.

ఉ.  తారకమైన వాఙ్మయసుధన్ చవిచూపెడు కావ్యబిందు వి
స్తారసుఖానుభూతి సతతమ్ము వరించు రసజ్ఞతే కళో
ద్ధారకు లుర్వి నారవిసుధాకరమైన యశమ్ము వారిదే
ధీరుడు తిమ్మరాడ్వరసుధీజనమాన్యుని వంటివారిదే.

చ.  కవిహృదయమ్ములో వెలయు గాయకుఁడో ఘనచిత్రకారుఁడో
చివురులపై నటించు నవజీవనరమ్యకళానువాదముల్
భువికి వెలార్చువేళ మృదుపుష్పరసాశ్రయకావ్యసుందరిన్
దవిలి భరించు భర్తకు సదావరభోగచిరాయువుల్ గదా !

ఉ.  రాజకిరీటకాంతి కవిరాజసమాదరణమ్ముఁ జూపి సం
పూజనముల్ వెలార్చు యుగముల్ శ్రుతిదప్పెనుగాని నేటికిన్
రాజిలు కైతలందు బుధరాజికి విందులు సేయువారి ని
ర్వ్యాజత గారవించు మన రాయని తిమ్మవిభుండు కంటిరే?

చం.  ఇతడు ప్రసిద్ధభావములకెత్తిన దీపికలైన కావ్య సం
తతికి మహోపకారి వినుతమ్ముగు నవ్యనరేంద్ర సాహితీ
వ్రతనియతిన్ సుకావ్యఫలరాసులు వాణికిఁ గాన్క సేయు పం
డితకవిమిత్రుడౌ ననఁగ నిల్చు యశమ్ము కులమ్ము వర్ధిలన్

ఉ. ఏ రుచిరాశయమ్ము ప్రవహించిన తీర్థమొ తిమ్మరాజ శో
భారమణీయకల్పనలపై మహితాదరణమ్ముఁ జూపు వి
స్తారదయాభిషిక్తమగు స్వాంతము మీయెడఁ గానవచ్చె నీ
ధారుణి కీర్తి నిల్పెడు వదాన్యతకన్నను భాగ్యమున్నదే?

శా. రాజై నిచ్చలు సత్కళాభిరతులన్ ప్రజ్ఞన్ నిదానించి శ్రీ
రాజన్మంగళరమ్యభావసుజనారాధ్యమ్ములౌ సత్కృతుల్
రాజిల్లన్ దగు పెంపుఁజూపుచును ధీరస్తుత్యుఁడై వర్ధిలన్
తేజోవంతుఁడ వీవె ధన్యుఁడవు ధాత్రిన్ తిమ్మరాజాహ్వయా.

అభ్యుదయ పరంపరావాప్తిరస్తు!



# ఉ చి త జ్ఞ త

శ్రీ ఆకెళ్ళ పార్వతీశము

పవిత్ర గోస్తనీతీరస్థ శ్రీ తణుకు పురవాసులు శ్రీమంతులునగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు జమీందారుగారి త్రిషష్టితమ జన్మదినోత్సవమున కృతిస్వీకృతిమహోత్సవసమయమున సమర్పితమగు శుభాశీర్వచనపత్రము.

శ్లో॥ ముళ్ళపూడికులాబ్ధీందు తిమ్మరాజాయ సంతతమ్ । ఆయురారోగ్య మైశ్వర్యం దద్యాత్ శ్రీపరమేశ్వరః

శ్రీ తిమ్మరాజు జమీందారుగారూ !

సామాన్యముగ శ్రీమంతులందరును అందుకొనలేని యీ ఆనందమయ జీవనము తమకు జన్మతః అబ్బిన అపూర్వ పుణ్యఫలితమే అయినట్లు ఈ సారస్వత ప్రియత్వముకూడ నట్టిదేయగుట విశేషము.

పలువురు పండిత కవులతో పరిచయము చేసికొనుచు, వారికి ప్రోత్సాహమొసంగుచు, సారస్వతసేవ చేయుచు బహుశ్రుతులైన మీకు ఈ శుభసమయమున ననేక శుభాకాంక్షలర్పించుచున్నాను.

'జగమెఱింగిన బ్రాహ్మణునకు జందెమేల?' అనునట్లు మిమ్ములను ప్రస్తుతించుట అప్రస్తుతమే అగునేమో! తణుకుపురమున నెచటగాంచినను మీయశస్సు వేనోళ్ళ చాటుచున్న పెక్కు విద్యాసంస్థలు, పారిశ్రామిక సంస్థలే యిందులకు తార్కాణముకదా?

'సంసార విషవృక్షస్య ద్వే ఫలే అమృతోపమే' యనురీతిని 'కావ్యామృత రసాస్వాదనము, సజ్జనసల్లాపము' అనువానితో ఆనందమయజీవితము గడపుచున్న మీరు ధన్యులు.

ఎంతటి మానవునకైనను, మహారాజునకైనను ఇంతకంటె ఏమి కావలసియున్నది? ఇంతియకాదు, మీపట్టినదెల్ల బంగారముచేయు పరుసవేది మీచేయి మీ జాలిగుండెలో అమృతభాండములున్నవి. మీ నిరాడంబర జీవితములో అయస్కాంతములున్నవి.

తాము తమ పుత్రరత్నము శ్రీ నరేంద్రుని స్మృతిచిహ్నముగ శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలిని స్థాపించుట ఎంతయు గౌరవముగ నున్నది.

శ్లో॥ యావత్కీర్తిర్మనుష్యస్య పృథివ్యాం ప్రథితా భవేత్ । తావానేవభవేత్స్వర్గః సతిపుణ్యేహ్యనంతకే
సురాలయసరోవాపేకూపారామాదికల్పనా । ఏతదర్థంహి పూర్తాఖ్యా ధర్మశాస్త్రేషు నిశ్చితా॥

అను పురాణవచనము ననుసరించియు యుక్తముగ నున్నది. వేయేల! కావ్యామృత రసాస్వాదనప్రియులగు మీరు 'ఔచిత్యవిచారచర్చ'ను అంకితముగ గొనుటయు తమ ఉచితజ్ఞత కుదాహరణమేకదా.

తాము అఖండానురాగసుధాలహరితో శ్రీ నరేంద్రుని స్మృతిచిహ్నముగ నాటిన నాటి సాహితీమండలీ లతిక తెనుగుపొలాల తరుణకాంతులతో శ్రీ నరేంద్రుని యశోగీతికాచందనసౌరభములు వెదజల్లుచు స్థిరరూపమున నభివృద్ధి గాంచుగాక !

# ఆశీర్వాదః

శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

శ్రీ ముళ్ళపూడికులవారిధిపూర్ణచంద్ర !
శ్రీ తిమ్మరాజబుధ సత్తమ ! పుణ్యమూర్తే
జన్మోత్సవేద్య భవతో హరిముఖ్యదేవాః
ఆయుర్ముఖాధికసమస్తశుభప్రదాస్స్యుః

సద్భాగ్యశాలిషు భవాన్ ప్రథమో ద్య గణ్యః
సత్సూనునా జయసి వారిధి రిందునేవ
తణుక్క ర్మహాపుర మభూ త్ఖలు సూనునా తే
సాహస్రవేతనభృతో బహవోస్య భృత్యాః

దాతా త్వం కరుణార్ద్రమానసయుత స్త్వం సత్యవాదీ భవాన్
విద్యావజ్జనపక్షపాతకలిత స్త్వం దైవభక్తో భవాన్
మాతాతాతపయోధికేషు వినయశ్రీసమ్రభావో భవా
నేతాదృగ్గుణవారిధే జయ జయ శ్రీ తిమ్మరాజాధునా.

మహారాజాః పూర్వే సుకృతినిపుణాః పుణ్యమతయో
కవీన్ ప్రోత్సాహ్యైతత్కవికృతకృతీః ప్రాప్య ముదితాః
ఇదానీం సారజ్ఞః ప్రకృతిసుభగ స్తిమ్మనృపతిః
కృతిం గృహ్ణాతీతి శ్రవణముదితాస్మో హ్యతితరాం.

కృతినా చ పతిః పతినా చ కృతిః
కృతినా పతినా మతిమాన్ సుకవిః
ఆయుః కీర్త్యైశ్వర్యసమేతాః
రాజంతు చిరం విజయం త్వనిశం.



ప్రారంభోపన్యాసకులను సమ్మానిస్తున్న

శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్, ఎం. ఎల్. ఏ.

# కృతజ్ఞత

"సాహితీవల్లభ" శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు

నన్నిలా కూర్చోబెట్టి ఇంతమంది ఇన్ని మంచిమాటలు చెబుతూవుంటే ఇక నాకేమిచెప్పాలో తోచటంలేదు.

నాకు మొదటినుంచీ కవులతో పండితులతో ఉపాధ్యాయులతో పరిచయ మంటే చాలా ఇష్టం. శ్రీ కొండూరి నరసన్నగారు, శ్రీ వేమూరి రామకృష్ణరావుగారు, శ్రీ నాదెళ్ళ కృష్ణమూర్తిగారు, శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజుగారు, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు— మొదలయిన వారివల్ల నాకు అనేకములయిన మంచి అభిరుచులు ఏర్పడ్డాయి.

శ్రీ నరసన్నగారు రామకృష్ణ పరమహంస, వివేకానంద, మొదలయిన అధ్యాత్మిక మహా పురుషుల చరిత్రలు చదివి వివరించి మంచి గ్రంథాలంటేనూ మహాపురుషుల చరిత్రలంటేనూ ఆసక్తి కలిగించారు.

శ్రీ రామకృష్ణరావుగారు లోకమాన్య శ్రీ బాలగంగాధరతిలక్ చరిత్ర చదివి వినిపించారు. అప్పటినుంచి ఇప్పటికీ నాకు జాతీయనాయకు లందరిలోకీ తిలక్ అంటే ఉన్నతోన్నత మయిన భక్తి. నాలో జాతీయభావం ఏర్పడటానికి ఆనాటి ఆ తిలక్ మహాశయుని చరిత్రయే మూలకారణం.

నాటినుంచీ ఎన్నో గ్రంథాలు ఆయనకు చెందినవి తెలుగువి చదివాను.

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారివల్ల ముద్రారాక్షసాది సంస్కృత నాటకపరిచయం ఏర్పడింది. అందువల్లే శ్రీ శర్మగారిని ఆర్యచాణక్యు డనే నవల వ్రాయమని కోరటమూ అది అందరి మన్ననలూ పొందటమూ జరిగింది.

శ్రీ సత్యనారాయణరాజుగారు నాకు కవులతోను, పండితులతోను, వారివారి గ్రంథాలతోను పరిచయం వృద్ధికావటానికి సాయపడ్డారు.

ఆదినుంచీ తోడునీడగా ఉంటూ ఈ అన్ని అభిరుచులకూ తమప్రభావం నామీద ప్రసరింప జేసిన మిత్రులు శ్రీ నాదెళ్ళ కృష్ణమూర్తిగారు.

వీ రందరివల్లా జరిగినది ఒక యెత్తు— మా నరేంద్రునిమూలాన ఐనది ఒక యెత్తు. అతను మాకు దూరమయినపుడే నాకు నిజమయిన బలమైన ఉద్బోధం కలిగింది. దానికి నిదర్శనమే ఈ నరేంద్రనాథసాహిత్యమండలి.

నన్నుగురించి నాయందు ప్రీతిగలవారు చాలాచాలా చెప్పారు. వాటికి నేనేమీ చెప్పలేను. కాని ఉపాధ్యాయు లంటే నాకు ప్రత్యేకగౌరవ మున్నమాట చాలా సహజం.

వారినిగురించి నాకు మొదటినుంచీ ఒక అభిప్రాయ మున్నది. మీ రే యితరశాఖలలోని వారినైనా చూడండి వారిలో చాలా మందినిగురించి రకరకాలుగా వింటుంటాము. ఉపాధ్యాయు లలాకాదు. ఎక్కడో నూటికి కోటికి ఒకరు తప్ప ఉపాధ్యాయులు తప్పుచేయరు.

ఉపాధ్యాయులపట్ల అందఱూ అధికగౌరవం చూపా లనటానికి మఱొక కారణం వారు మంచికి ఆధార మవటం.

యాక్షన్‌కి రియాక్షన్ ఉంటుందని అందరికీ తెలుసు. ఉపాధ్యాయులపట్ల లోకం ఎలా ప్రవర్తిస్తే వారిపిల్లలపట్ల ఉపాధ్యాయులశ్రద్ధ అలా ఉంటుంది. తనపట్ల లోకం చిన్నచూపు చూచినా తాను పిల్లలపట్ల ఉదారంగా ఉండే ఉత్తముడు ఉపాధ్యాయుడు. అతడు నిత్యమూ సంతుష్టుడై మన అందరి మన్ననలూ అందుకుంటూ ఉంటే మన విద్యారంగం ఎలా ఉంటుందో ఊహించండి.

మఱొకమాట. పరిచితులపట్ల నేను చూపేశ్రద్ధ నిజమే. అందఱిలాగే నాకూ నా మిత్రులంటే చాలాఇష్టం. అందఱిలాగా కాదేమో అనికూడా అనిపిస్తుంది. దయచేసి దీన్ని మరోలా అనుకోకండి.

నాకు మిత్రులు తక్కువఉన్నా నేను విచారించను గాని ఒకసారి నా మిత్రుడు అయినవాడు అతనిలో ఎన్నిలోపాలు ఉన్నాసరే నాకు దూరంకావటానికిమాత్రం నామనస్సు ఎన్నడూసహించదు.

అందుకే నా మిత్రులు కొందఱు అనేక కారణాలవల్ల నాకు కొంచెం ఎడమయినా నేనే వారి వెంటబడి తిరుగుతాను. ఇది కొందరికి విడ్డూరంగా కనిపించటం కూడా ఉంది. నన్నెందఱో ఇలాంటి విషయాలలో హెచ్చరించారుకూడా. "అతనికి ముక్కువ తగ్గినప్పుడు మీ రెందుకు అతని చుట్టూ తిరుగుతారు? ఇది మీ స్థాయికి తగదు" అని. కాని నాపద్ధతి నేను విడువను. నాకు తెలును "తలుపులు మనమైనా మూసెయ్యకుండా ఉంచితే వా రెప్పటికైనా సత్యం గుర్తించి వెను దిరిగి చూచుకుని మళ్ళీ నాదగ్గఱకు వచ్చి తీరుతా"రని. అందు కెంతకాలం ఎదురుచూడవలసి వచ్చినాసరే ఎదురుచూస్తాను. నాకు విసుగు లేదు.

ఏ రెండు బుఱ్ఱలూ ఒకలా పనిచెయ్యవు. చెయ్యకూడదు కూడా. అయితే ఆలోచనావైవిధ్యం అభిప్రాయభేదం- విరోధాలకు దారితీయరాదు. ఇది నా నమ్మకం.

అందుకే నా మేలుకోరే మిత్రులలో మనస్తాపా లుండటం సంభవిస్తే నాకు చాలా బాధా కారణ మవుతుంది. అందుకే వా రందరికీ నా మనవి. "మీలో మీకు ఆలోచనావైవిధ్యం ఉండ వచ్చు; ఉండాలి, కాని నేను మీ అందఱిప్రేమకూ పాత్రుణ్ణి. మీరంతా ఒకచోట కలియటానికి కారణం నామీద మీ కున్న ప్రేమ. కనుక మీరంతా మణులయితే నా స్నేహం సూత్ర మనుకుని విడివడిపోకుండా ఉండి నాకు శోభ తీసుకురావాలి"అని.

ఎక్కడ చూద్దామన్నా భేదబుద్ధి పెరిగిపోతోందేమో అని భయంవేస్తున్నది నాకు. నలుగురు కుమార్తెలు గల ఒకతండ్రి ఉంటే, ఏదో పనిఉండి అందులో ఒక అమ్మాయి రెండుసార్లు పుట్టింటికి వస్తే మిగతా ముగ్గురూ "నాన్నగారికి అది అంటే అభిమానం ఎక్కువ" అని నిండాపడిపోవటం చూస్తున్నాము. ఈ మనస్తత్వమే వ్యక్తిగత విరోధాలదగ్గరనుంచి కుటుంబ, వర్ణ, వర్గ, కుల, జాతీయ అంతర్జాతీయ భేదాలకు సగం కారణ మనిపిస్తుంది.

లోకంలో అపోహలూ అసమంజసభావాలూ ఏర్పడితే చక్కబరచవలసినవారు రచయితలు. రచయితలలో పరస్పర విరోధాలూ అనైకమత్యమూ— ముఖ్యంగా మన తెలుగు రచయితల్లో— పెరిగి పోతున్నందున మనకు సాహిత్యమూ అట్టి విరుద్ధభావాలదే వచ్చి ఆ అపోహలూ అసమంజస భావాలూ పెరుగుతున్నాయి. రచయితలు సమబుద్ధీ ఐకమత్యమూ కలవారయిననాడు లోకంలో నిజంగా సమబుద్ధీ ఐకమత్యమూ కలిగితీరుతాయి.

మీ రంతా— రచయిత లంతా— నాకు సంబంధించినవారంతా - నా మాటలు గ్రహిస్తా రనీ అప్పుడే నా పెద్దరికం నిలిపి గౌరవించిన ట్టనీ చెపుతున్నాను. ఆ విధంగా నా సారస్వతాసక్తిని ప్రోత్సహిస్తా రని నమ్ముతున్నాను.

నే నెంత వద్దన్నా వినకుండా ఈ ఉత్సవం ఏర్పాటుచేశారు— శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగా రంతటివారు నాకు కృతియిచ్చి దీనికి మరింతశోభ తెచ్చారు. ఎంతో దూరంనుంచి అధ్యక్షులు శ్రీమాన్ నారాయణాచార్యులుగారు ఇంకా ఎన్నోపనులు మానుకుని గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరిజిల్లాలనుంచి ఎందరో కవులు, పండితులు, నా మిత్రులు, బంధువులు దయచేశారు. వక్తలందరు నన్నుగురించి ఎన్నో మంచిమాటలు చెప్పారు.

పైగా మీ రందరూ కలిసి "సాహితీవల్లభ" అని ఒక బిరుదుంచి నా కొక బరువు తెచ్చి పెట్టారు. ఏదో గుట్టుగా చరిత్రకూ సాహిత్యానికీ నాకు తోచిన దోహదం చేసేవాణ్ణే గాని నా కీ అట్టహాసా లెందుకు? అయినా పెద్దలమాట శిరోధార్యం.

నా పట్ల ఇంత అభిమానమూ, మైత్రి చూపిన మీ కందరికీ నా కృతజ్ఞత.



# అధ్యక్షోపన్యాసము

శ్రీ ముక్తివి లక్ష్మణదాసు

*(శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి జన్మదినోత్సవమైన మజునాడు శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి మహాకవి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులగారి సాహిత్యోపన్యాసము ఏర్పాటుచేసినది. వసుచరిత్రగురించి వారు ఉపన్యసించిరి. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు వక్తనుగూర్చి పరిచయోపన్యాసమొసగిరి. "ముముక్షువు" సంపాదకులు శ్రీ ముక్తివి లక్ష్మణదాసుగారు అధ్యక్షత వహించిరి. ముప్వురిని సాహితీవల్లభ శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు నూతన వస్త్రాదులతో సత్కరించిరి. అధ్యక్షోపన్యాసము ఈదిగువ ముద్రితము.)*

అస్మద్గురుభ్యోనమః! సభాయైనమః!

మహాశయులారా!

నేటి ఈ మహాసభలో ప్రసంగించబోయే ఇరువురూ ఆంధ్రావనిలోనేకాక అఖిలభారతంలోనూ లబ్ధప్రతిష్ఠులు. వాల్మీకిమహర్షి రామలక్ష్మణులను ఇంద్ర వరుణులతో ఉపమించారు. ఈ ఇరువురూకూడా ఇంద్ర వరుణులవంటివారు.

శ్రీ మాధవరామశర్మగారు సంస్కృత వాఙ్మయ సేవకు జీవితాన్ని అంకితంచేసిన ధన్యులు. ఎంతోమంది ఆలంకారికులనుకూడా గందరగోళంలోపెట్టే "రసగంగాధరం" "ధ్వన్యాలోకం" వంటి మహాగ్రంథాలను తెలుగువారి కందించి మహోపకారం చేశారు. ఆ కోవకి చెందినదే "ఔచిత్య విచారచర్చ"—"సాహితీ వల్లభు"లైన మన శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారికి నిన్న అంకితం చేశారు. శ్రీ శర్మగారిది ఒక విలక్షణమైన ప్రతిభ, విశిష్టమైనశైలి. ఆయన గ్రంథం చదువుతున్నా, ప్రసంగం వింటున్నా భేదం కనిపించదు. అది ఒక మహాఝరి—కొత్తగోదావరి.

ఇక "సరస్వతీపుత్రులు" శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు — ఈయన పదునాలుగు భాషలలో చక్కని పాండిత్యంకలవారు; తొమ్మిది భాషల్లో మధురంగా కవితచెప్పగల ప్రజ్ఞాశాలి; సంగీతంలోనిధి; భరత శాస్త్రంలో ప్రవీణులు—ఏకళలో చూచినా ఏకచుళుకాహంకార నిశ్శేషశోషిత పాథోధిపయస్కుడు," ఈయనను ఏక్షణాన చూచినా తానూ, తన కవితాసరస్వతి- అంతే. తక్కినలోకంతో పనిలేని కేవల కవితాయోగిగా దర్శనమిస్తారు. ప్రసంగం ఆరంభిస్తే మహాశివతాండవం ప్రత్యక్షంగా దర్శిస్తున్నట్టు అనుభూతి కలుగుతుంది.

ఇట్టి మహాపురుషు లిద్దరిమధ్య కూర్చొని సభను నిర్వహించటానికి నావంటివాడు తగడు. అన్నివిషయాలలోనూ ఔచిత్యం పాటిస్తున్న శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి ఈ ఒక్కవిషయంలోనూ ఎందుచేత అతిక్రమించిందో తెలియటంలేదు. అయినా పెద్దల ఆజ్ఞ—అవిలంఘ్యం— అస్తు—

ఇక శ్రీ నారాయణాచార్యులుగారు ఈనాడు ప్రసంగించబోయే విషయం — "వసుచరిత్ర — రచనా వైచిత్రి" ఈ సందర్భంలో ఒక ముఖ్యవిషయం గమనించాలి. ప్రబంధాలన్నా, ప్రబంధకర్తలన్నా నేటి వారిలో ఒక వైముఖ్యం వ్యాపించింది. ఆ కవులకు సామాజికమైన మంచిచెడ్డలతోనూ, కష్టసుఖాలతోనూ ఏమీ సంబంధంలేదనీ, తమకు ఆశ్రయమిచ్చిన ప్రభువూ, అతని అభిరుచులూ ఇవే వారికి పట్టిన విషయాలనీ. ఆ ప్రభువును తృప్తిపరచటమే ధ్యేయముగా తమ కావ్యాల నిండా కచకుచాది వర్ణనలు నింపిపెట్టారనీ. ఇకపోతే—భాషావిషయంలో భావ వ్యక్తీకరణకంటె భాషలో

తమకుగల ప్రావీణ్యం ప్రదర్శించటానికే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి "సర్కస్ఫీట్సు" చేశారనీ, ఇట్టివే ఇంకా కొన్ని ఆరోపణలు వినవస్తున్నాయి. తమ కాలంలోని సామాజికస్థితికీ, ప్రజల సాంస్కృతిక వికాసానికీ. ఆ కాలంలోని సామాజికస్థితికీ, ప్రజల సాంస్కృతిక వికాసానికి భేదంఉండి ఉండవచ్చుఅనీ, ఆ యా స్థితిగతులలో ఉత్థానపతనాలు చక్రనేమి క్రమంగా జరుగుతూఉంటవి అనీ–అలోచించగలవారు పై ఆరోపణలు చేయటానికి సాహసించరు. ఆ మహాకవులకు ఉన్న భావస్వాతంత్ర్యాన్ని మనం ఊహించలేం. కళ్ళుతెరిచి చూడగలిగితే–ప్రబంధవాఙ్మయంలో తమనాటి సామాన్య ప్రజాజీవితాన్నీ. ప్రజల అభిరుచులనూ, సంఘంలోని క్లిష్టసమస్యలనూ, పరిష్కారమార్గాలనూ, చక్కగా చిత్రించారు ఆ మహాకవులు. అయితే–వ్యంగ్యంగా సూచిస్తే అర్థంచేసికోగల తమనాటి ప్రజలనే దృష్టిలోఉంచుకొని చెప్పటం, వాచ్యంగా చెప్పినా అర్థంచేసుకొనటం కష్టమైనవారుకూడా విమర్శకులుగా పరిగణింపబడేకాలం ముందు ముందు వస్తుంది అని ఊహించలేకపోవటం, ఒకవేళ ఊహించినా ఉపేక్షించటం–ఇవి అ మహాకవులలోని దోషాలు అని అంగీకరించటానికి నాకేమీ అభ్యంతరంలేదు. కొంత బరువుగా చెప్పిన భావాన్నీ, పటిష్ఠంగా- అంటే సమాస భూయిష్ఠంగా అనికాదు–వ్యంగ్యమర్యాదతో అని -చెప్పిన పద్యాన్నీ చూచి జడుసుకునే దుర్యోగం పట్టింది మన జాతికి. నేటి కవివిశ్వనాథుడన్నట్లు కారమూ పులుసూ తిని చవిచచ్చిన నాలుకలకు మధురపదార్థం మొగం మొత్తటం సహజంగదా!

ఇంకొకవర్గంఉంది – ఏదో ఒక ప్రత్యేకశైలివారికి ఇష్టం. ఆ శైలిలో ఉన్నదే కావ్యమనీ, ఆటుగాని ఇటుగాని ఏ బెత్తెడు జరిగినా ఇక ఆది అంతా గడ్డీగాదరా అనీ–ఇలా ఉంటుంది వారి విమర్శ. విమర్శకుడు సహృదయుడుగా ఉండాలి. నిర్మలీభూతమైన మనోముకురంకలవాడు సహృదయుడు అంటే "ప్రిజుడిస్" అంటామే-అది లేకుండా ఉండాలన్నమాట. అప్పుడే కవిని అర్థంచేసికొనటం సాధ్యం, వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేనివాడు, ఆనందించలేనివాడు కావ్యం చదవటానికి యోగ్యుడుకాడు. తన ఆ యోగ్యతను అంగీకరించే ధైర్యం లేనివాడు దాన్ని ఏనాడో గతించిన ఆ మహాకవిని ఉద్దేశించి విసురుతాడు.

రామరాజభూషణ మహాకవిని తీసుకుందాం – అతని వసుచరిత్రనుగూర్చి ఒక అపప్రథఉంది–అది కేవల శబ్దాలంకార ప్రధానమైన కావ్యమనీ: శ్లేషా, శబ్దాలతో చేసిన సర్కస్సూతప్ప ఏమీలేదనీ. ఇక్కడ ఒకవిషయం అలోచించాలి. రామరాజభూషణుడు వసుచరిత్ర ఒక్కటే వ్రాయలేదు. నరసభూపాలీయం అనే అలంకారశాస్త్ర గ్రంథంకూడా రచించాడు. అందులో కేవలం శబ్దాలంకార ప్రధానమైన కావ్యం చిత్రకావ్యమని – అధమకావ్యం అనటం ఇష్టంలేక ఆలంకారికులు మృదూక్తికోసం పెట్టిన పేరుఇది–ప్రతిపాదించాడుగదా! తానన్న ఆ మాటపై తనకే విలువలేదా! లేక అధమకావ్యలక్షణం చెప్పాడు కనుక లక్ష్యభూతంగా ఇది రచించాడందామా? ఇది ఉచితంగా ఉంటుందా? ఆ శబ్దాలంకారాలుకాక ఉత్తమ కావ్యతాసిద్ధికలిగించే ఇతర మహాగుణాలు ఎన్నైనా ఉన్నాయి. శబ్దాలంకారాలనైనా ఊరకే శబ్దాలంకార ప్రాయాలుగానే ఉపయోగించక ఆ శబ్దాలంకారాల ద్వారా చమత్కారంగా కథాసంవిధానాన్నీ, పాత్రౌచిత్యాన్నీ పరిపోషించాడు. సంగీతశాస్త్ర రహస్యాలెన్నిటినో గుప్పించాడా మహాకవి.

ఈ చమత్కారాలూ, విశేషాలూ అన్నీ సంప్రదాయసిద్ధంగా పాత ప్రవచనాల్లోఉన్నాయి. రాయలసీమలో తమ తండ్రిగారివద్ద అట్టి రహస్యాలెన్నో గ్రహించి, తమ ప్రతిభావిశేషంతో మరికొన్నిటిని వెలికి తీసి రామరాజభూషణునికొక మహావ్యాఖ్యాత అయ్యారు శ్రీ నారాయణాచార్యులుగారు.

నిజానికి మన నరేంద్రనాథ సాహిత్యమండలి వంటి సంస్థలు ఇట్టి మహావిమర్శకులను పిలిపించి ఏనెలనాళ్ళో ఇట్టిగోష్ఠి ఏర్పాటుచేస్తే కొంతలోకొంత అయినా ఆ మహాకవినిగూర్చి తెలుసుకోగలుగుతాం.

ఈనాటి రెండుగంటల ప్రసంగంతో చాలదు-ఇది ఆ మహాకవినిగూర్చి మనలో కొందరికి ఉన్నపొరపాటు భావాలను పోగొట్టి, ఆ కావ్యాన్ని జాగ్రత్తగ అధ్యయనం చెయ్యాలి అనేక ఉత్సాహాన్నీ ఆవేశాన్నీ కలిగిస్తుంది. అదిమాత్రం తక్కువ ప్రయోజనమా?

ఈ సందర్భంలో నేనుకూడా పాలుపంచుకునే అవకాశం ఇచ్చి ఆదరించిన శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి కార్యకర్తలకు కృతజ్ఞత తెలుపుతూ ముందుగా శ్రీ మాధవరామశర్మగారినీ, అనంతరం శ్రీ నారాయణాచార్యులవారినీ ప్రసంగించ వలసిందిగా కోరుతున్నాను.

# నివేదనము.

శ్రీ మహంకాళి వెంకట్రామయ్య.

నేను తగుదునో తగనో యీ స్థానమునకు
నీదుదయజేత నీ సభావేదిపైన
నిలిచినాడను పద్యాలుపలుకదలచి
వేంకటేశ్వర ! యిదె నిన్ను వేడుచుంటి.

తెలుగు భాషాభిమానియౌ తిమ్మరాజు
ప్రోద్బలంబున నీతిరుక్షేత్రమునందు
సభ ప్రసాదు ప్రసాద ప్రాసాదమందు
జరుగుచుండెను నీదయన్ తిరుమలేశ !

ఘనుడౌ మాధవశర్మగారికి నమస్కారంబుగావింతు ఆ
యన "ఔచిత్యవిచారచర్చ" యను కావ్యంబొందు తావ్రాసె నీ
వినయస్వాంతుడు తిమ్మరాజునకు సంప్రీతిన్ కృతిన్‌చేయ నీ
యనుకంపన్ సభ నేడిటన్ జరుగు దేవా ! వేంకటేశప్రభో !

వేదుల, పుట్టపర్తి, సుకవీశ్వరులాదిగ పెద్దలందరీ
వేదికమీద పాల్గొనగ, పెండ్లికుమారుడు తిమ్మరాజుగాన్
మాధవశర్మ కావ్యసుకుమారి పెండిలియయ్యె, కట్నమే
లేదు, వివాహమంతయును ప్రేమవివాహము, వేంకటేశ్వరా
నీదయ వీరికెల్లెడల నిర్మలమైన యశస్సుగూర్పవే !

వారు రసజ్ఞులన్న నుడి వాసనబట్టిన కావ్యకన్య శ్రీ
వారిగనెంచె మేటిధనవంతులులేరనికాదు, సుందరా
కారులులేకకాదు, తనకన్యకు మాధవరామశర్మ బం
గారమువంటి పెన్మిటిని గల్గగజేసెను, ముళ్లపూడి సం
సారము భోగభాగ్యముల సాగగజేయవె వేంకటేశ్వరా !

చిన్నికుమారుమారుగ సృజించె నరేంద్రుని పేర "సంస్థ"యన్
కన్నియఁ దణుకులోన, మమకారముతీరని తిమ్మరాజు, వే
వన్నెల రోజురోజునకు వర్ధిలజేయవె ! దానినోయి వెం
కన్న ! శతాయువున్ కలుగుగావుత నీదయ తిమ్మరాజుకున్.

లీలగదోచు నాతడు నరేంద్రుడుగావలె బాబు ! ఏల యీ
హాలుకు వచ్చినావు ! దరహాసముఖాంబుజ ! నిన్నుజూడ ప్రా
ణాలవిలేచివచ్చెపుడునాన్నకు యుత్సవమందునీవు నీ
పాలునుపంచుకోదలచివచ్చితివా ! సుకుమార ! పొమ్ము మే
ఘాలచలించు పాదములుకందుసిమెంటుపయిన్ చరింప యీ
బాలకు నాత్మశాంతికయి ప్రార్థనజేసెద వేంకటేశ్వరా !

ఎందరులేరు ! భూస్థలి నహీనధనాఢ్యులు, కాని, వారిలో
కొందరుమాత్రమే ప్రజలకోసముజేతురు దానధర్మముల్
ఎందుకుజేతగానిగుణహీనులు వారినిదుయ్యబట్టగా
నుందురులోకమందు ధరనుత్తమవంశపు ముళ్లపూడివా
రిందుకుసాక్షి నీదుదయనేలుమువారిని వేంకటేశ్వరా !

ఎల్లశుభంబులిచ్చి పరమేశ్వర ! వేంకటనాధ ! సాహితీ
వల్లభు ముళ్లపూడికులవార్నిధిచంద్రుని తిమ్మరాజునిన్
చల్లగచూడుమాతడతి శాంతుడు పండితభక్తిభావసం
ఫుల్లమనోజ్ఞనేత్రుడు, నమోఘచరిత్రుడు, స్నేహపాత్రుడున్.

# అభినందన పద్యరత్నములు.

'గాయకశిరోమణి' 'ఉభయభాషాప్రవీణ' P. O. L.
శ్రీ గోనెళ్ల రామమూర్తి శాస్త్రి.

శ్రీమత్సర్వ చరాచరాత్మక జగత్సింహాసనాధ్యాసినీ
బ్రహ్మేంద్రాది సురారిమౌళి రుచిరశ్రీపాదుకాభాసినీ
పాలించద్భూషణ రాజిరాజితతనూ తేజస్సముద్భాసినీ
రాజద్రాజవిరాజమానవదనా శ్రీరాజరాజేశ్వరీ
శుంభత్కావ్యవచః ప్రశంసిత మహౌదార్యాదిదివ్యద్గుణం
జీవాధారకళాప్రబోధక కళాశాలాశతస్థాపకం
సేవాకార్యపరాయణం సుచతురం పౌరప్రజారంజనే
రాకేందుం వర ముళ్ళపూడిజలధౌ శ్రీ తిమ్మరాట్సత్ప్రభుం
దేవీరక్షతు సత్కృపారసఝరీ పూర్ణైశ్శుభాలోకనైః॥

విద్వత్కవీంద్రుడౌ పెద్దనార్యుని
కవిగండపెండెరముతో గౌరవించి
అనుపమకావ్యమ్ము మనుచరిత్రముగొంచు
పెద్దనకవితకున్ మెప్పుజూపి
కావ్యోక్తిరత్నాల కంఠహారములిచ్చు
అష్టదిగ్గజముల నాదరించి
ఆంధ్రవాణికి గంఠహారమ్ము నాముక్త
మాల్యదకర్తయై మన్ననంది

ఆంధ్రభోజుడన్ బ్రఖ్యాతి నలరు కృష్ణ
దేవరాయల సత్కీర్తి దిశలనిల్చె
మెచ్చి కృతులంది కవికోటినేలు ప్రభులు
తిమ్మరాజేంద్ర! త్వాదృశుల్ స్థిరసుచిరము
విశ్వసన్నుతకీర్తితో వెలయుచుంద్రు.

ఆంధ్రభూసంపద కభినవశ్రీగూర్చు
పాలిటెక్నిక్ సంస్థ బాదుకొల్పె
తెల్గుభూమినినిల్పు నలకాపురమ్మున
తిమ్మరాజపురము స్థిరతగట్టె
చిరలక్ష్మివెలయించు జీవకళంగూర్చు
నింజనీరులనిల్పె నెల్లదెసల
హృద్యకావ్యసృష్టి నెలమిగావింపగా
కవివరబ్రహ్మల గౌరవించె

కవివచస్సుధారసవర్షి కావ్యకల్పకమ్ముగ నరేంద్రసాహితీకంధినిల్పె
భూమిపాలక శ్రీగణ్యు ముళ్ళపూడిజలధి నుదితుఁడౌ తిమ్మరాట్చంద్రవిభుడు.

అవలేపంబొకయింతలేక మహనీయైశ్వర్యసంపన్నుఁడై
అవునన్నట్టి కవీంద్రులెందఱినో యాహ్వానించి లాలించి స
త్కవితాలోలుడు తిమ్మరాట్ప్రభుడు సత్కారంబులంజేయుచున్
కవితాకన్య బరిగ్రహించుటదియే కళ్యాణబాహుళ్యమై.

# శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి

## కార్యక్రమములు.

### అగష్టు 1963 – మే 1965.

19—10—1963 వ తేదీని శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి 'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి అధ్యక్షతను సమావేశమై కొన్ని నిర్ణయములు చేసినది.

(1) నెలకొకసారి కవిపండితులను సమావేశపఱచి సాహిత్యిక చారిత్రిక నూతనరచనలను గోష్ఠిలో చదివించుట, చర్చించుట

(2) వానిలో ఉత్తమమయినవానిని ప్రచురించుట.

(3) అన్యప్రాంతీయుల నాహ్వానించి గౌరవించుట.

(4) ఇందలి సర్వోపన్యాసములును లిఖితపూర్వకముగానుంచుట.

(5) తణుకునందలి యువరచయితలను ప్రోత్సహించుట.

(6) శ్రీ మధిర భానుమూర్తి, ఎం. ఏ., బి. ఇడి., 'భాషాప్రవీణ' శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య, ఎం. ఏ., బి. ఇడి., గారలను సంయుక్త కార్యదర్శులుగా వ్యవహరింపఁగోరుట.

ఇవి నాటి నిర్ణయములలో ముఖ్యమైనవి, వారిరువురును సంయుక్తకార్యదర్శులుగా నుండ నంగీకరించిరి. నాటినుండి జరిగిన కార్యక్రమముల వివరములివి.

| క్రమసంఖ్య. | తేది. | వక్తపేరు. | విషయము. |
|---|---|---|---|
| 1. | )–10–1963. | అధ్యక్షులు: 'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు. | శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి పునర్వ్యవస్థీకరణము. |
| 2. | 16–11–1963. | శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు. | నన్నయ. |
| | | శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ. | కాకఅపఱ్ఱు - పాండిత్యము. |
| | | అధ్యక్షులు: శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య. | |
| | 19–12–1963. | శ్రీ పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రి. | షడ్దర్శనములు. |
| | | శ్రీ శ్రీపాద వెంకటఅచ్యుతరామలింగేశ్వరశాస్త్రి. | 'రవిగీత' |
| 4. | 9–1–1964. | శ్రీ వి. జి. మోహన్‌రాజ్ మొ॥వారు, అధ్యక్షులు: శ్రీ కర్రి పుల్లయ్యనాయుడు. | శ్రీ తిమ్మరాజుగారు సాహిత్య అకాడమీసభ్యులయిన సందర్భమున అభినందనము. |

| | | | |
|---|---|---|---|
| 5. | 10–2–1964. | శ్రీ మధిర భానుమూర్తి. | షేక్స్పియర్ హేమ్లెట్. |
| 6. | 14–3–1 | శ్రీ కాం్రడేగుల రామచంద్రరావు. | సారస్వతములో సౌందర్యము |
| | | శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు, శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ ఆకెళ్ళ పార్వతీశము, శ్రీ యస్. వి. ఎ. రామలింగేశ్వరశాస్త్రి, శ్రీ గోనెళ్ళ రామమూర్తిశాస్త్రి, శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య. | ఉగాది సాహితీగోష్ఠి. |
| 7. | 29–4–1964 | శ్రీ ములగాల సేతుమాధవస్వామి. | అభిజ్ఞానశాకుంతలము. |
| 8. | 20–6–1964. | శ్రీ ఆకెళ్ళ పార్వతీశము. | మనుచరిత్ర - దాని విశిష్టత. |
| 9 | 12–8–1964. | శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య. | దక్షిణాంధ్రవాఙ్మయము, |
| | | శ్రీ వెలిది సత్యనారాయణమూర్తి. | స్వీయకావ్యపఠనము. |
| 10. | 19–9–1964. | శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య. | స్వర్ణయుగము. |
| 11. | 22–12–1964. | శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్. | నన్నయ కవితావిశిష్టత. |
| 12. | 12–4–1965. | శ్రీ సారంగు లక్ష్మీనరసింహారావు. | కవిత్వసంప్రదాయాలు - నాడు - నేడు. |
| 13. | 8–5–1965. | శ్రీ వడ్లమాని సోమశేఖరం. | 'హిందీకవిత' అందచందాలు. |

